# విజయ

అనుబంధ మాలికలో
వెలువడ్డ పన్నెండవ నవల

# నీడల చాటున నిజం

తోటకూర ఆశాలత





'విజయ' అనుబంధ మాలికలో

వెలువడ్డ పన్నెండవ నవల

విజయ
80. ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26

2

విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 13

DECEMBER 1976

'NIDALA CHATUNA NIJAM'

THOTAKURA ASHALATHA

ముఖచిత్రం : గంగాధర్

వెల : చెల్లింపలేనిది
(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడ్డ అమూల్య కానుక)

అన్ని హక్కులూ రచయిత్రివి

ప్రింటర్స్:

విజయా గ్రాఫిక్స్,
8, ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

3 TPLA133M131
4117
1127



"ప్రభూ! భవబంధాలకు ద్వేషవిద్వేషాలకు అతీతంగా ప్రేమ రాహిత్యంలో బ్రతుకుతున్న నీకు ఈ అనురాగపు అర్ణవంలోని అమావాస్య చీకట్లు, ఆర్తి అగాధాలు గుర్తుకు రావా?" అనుకుంటూ ప్రభుగదివైపు నడిచాడు సంజీవ్. రూములన్నీ లాక్ చేయబడి, హాలంతా నిద్రబోతూ నిశ్శబ్దమే నోరు విప్పుకున్నట్లుంది. మెల్లగా తలుపు తెరుచుకొని లోపలి కడుగేసి లైట్ ఆన్ చేశాడు సంజీవ్.

సితార్ మీద తల ఆనించి జాగ్రదావస్థలోనున్న ప్రభు, అలికిడికి అతిభారంగా కనురెప్పల్ని విప్పాడు.

తేనెరంగు కళ్ళతో తననే పరీక్షగా చూస్తున్న సంజీవ్ వంక అసహనంగాచూస్తూ, "ప్లీజ్ పుటాఫ్ ది లైట్ అండ్ క్లోజ్ ది డోర్" గొంతు పెగుల్చుకొని అన్నాడు.

"ప్రభూ!" అంటూ చొరవగా భుజంమీద చెయ్యేసి, ఎర్రని జీరలువారిన ఆ కళ్ళని, కన్నీటిచారికలు కన్పిస్తున్న ఆ చెక్కిళ్ళను చూపుతు ప్రేమతో స్పృశిస్తూ. "ఏడుస్తున్నావా?" అనడిగాడు సంజీవ్.
బాధగా కళ్ళుమూసుకొని, "లేదు" అన్నట్లుగా తలూపాడు ప్రభు.

"నన్నే మభ్యపెడ్తున్నావా?" అంటూ ఒడిలోని సితార్ అందు కొని ప్రక్కనపెడ్తున్న సంజీవ్ దృష్టి టేబుల్ మీదున్న చిత్రంపై పడింది. తల్లి కౌగిట్లో పారవశ్యం పొందుతున్న బిడ్డ చిత్రమది. "ఇలాటివి గీయొద్దని ఎన్నిసార్లు చెప్పాను." అన్నట్లుగా ప్రభుముఖంలోకి చూసి మరుక్షణంలోనే ఆ చిత్రాన్ని ముక్కలు ముక్కలుగా చించేశాడు.

"సంజీవ్...." బాధతో తొణికిసలాడింది ప్రభు కంఠం.

"ప్రభూ! సెంటిమెంట్ అనేది నరాల బలహీనతవల్ల వచ్చే జబ్బు. ఐ నో యు ఆర్ ఎ సెంటిమెంటల్ ఫూల్. ఏమీ లేకపోయినా ఏదో ఉన్నట్లుగా ఊహించుకోవటం, గోరంతదాన్ని కొండంతగా భావించుకొని మనస్సు పాడుచేసుకోవటం, నీచుట్టూ ఏదో ప్రపంచాన్ని సృష్టించుకొని ఆ చీకట్లో దిక్కు తెన్ను కానక బాధపడటం నీకే సరి పోయింది."

"కన్నవారి కరుణార్ద్రకృపథం నీకుండటంవల్ల దాని విలువ తెలియటంలేదురా."

"చస్.... టాపిక్ మార్చు" అని అగ్గిపుల్ల గీసి క్రిందపడున్న ఆ ముక్కలకి అంటించాడు. మండుతున్న ఆ ముక్కలవంకజూస్తూ, "సంజీవ్! ఆ చిత్రాన్ని చించి తగలబెట్టగలిగావ్ కాని నామనస్సులో ప్రతిష్టించుకున్న రూపాన్ని మాత్రం తుడిచివేయలేవ్!" అన్నాడు.

"ప్లీజ్.... లేచి వాష్‌చేసుకో."

"నేనా.... ఇప్పుడా!"

తలూపాడు సంజీవ్.

"ప్లీజ్...."

"నథింగ్ డూయింగ్.... ఫస్ట్‌గెటప్"

జాలిగా చూశాడు.

"నాకోసం" నవ్వుతూ అన్నాడు.

మారు మాట్లడకుండా లేచి బాత్‌రూంవైపు నడిచాడు ప్రభు.

డ్రస్ చేసుకుని రూఫ్‌మీదకి నడిచారు.

నడుస్తున్నవాడల్లా హఠాత్తుగా ఆగి, "సంజీవ్! కన్నవారి ప్రేమ పొందలేకపోయినా, నీ స్నేహమాధుర్యాన్ని మాత్రం గ్రోలగలుగు తున్నానురా!" రెండు చేతులూ పట్టుకొని అన్నాడు ప్రభు.

"ప్రభూ!"

"అవున్రా, అటుచూడు" అంటూ గ్రౌండ్ వైపు చూపించి, "అందరూ ఈ లోకాన్ని మర్చిపోయి తృళ్ళుతూ ఆడుతూ-పాడుతూ కాలం గడుపుతున్నారు. కాని చీకటిని కోరుకొనే గబ్బిలంలా ఆ గదిలోనే మ్రగ్గిపోవాలనుకుంటున్న నా కోసం నీ కాలాన్ని ఎందుకు నాశనం చేసుకుంటావురా!" అనడిగాడు.

"ప్రభూ! చంద్రుడ్ని చూడగానే సముద్రుడెందుకు పరవశించి పోతాడో తెలిసుంటే నీవిలా అడిగుండేవాడివి కాదు."

"సంజీవ్.... భగవంతుడే ప్రత్యక్షమై వరం కోరుకోమంటే జన్మ జన్మలకి నీ స్నేహాన్నే ప్రసాదించమంటాను." సజలమైన నేత్రాలతో చూస్తూ అన్నాడు.

"ఏమో.... నేనుమాత్రం వద్దంటాను" నవ్వుతూ అన్నాడు. శృతి కలిపాడు ప్రభు.

అంతలో 'కా-కా' యన్న కలవరం వినవచ్చింది.

గూట్లోని రెక్కలురాని పిల్లకాకులు తల్లినిచూడగానే ఎర్రని నోళ్ళని చాచి అరుస్తున్నాయి.

ఎన్నో యోజనాలనుంచి ముక్కుతో పట్టుకొచ్చిన గింజల్ని పిల్లల నోటికందిస్తున్న ఆ కన్నతల్లి కాకిని చూడగానే ప్రభు హృదయం ఆర్ద్రమైంది.

"సృష్టిలో అతి తియ్యనిది కన్నతల్లి.... సృష్టికి ప్రతిసృష్టి చేయగల కళాతపస్వి ఆ మహాశిల్పి.... రక్తమాంసాల్ని పంచి ఒక రూపాయన్నిచ్చి ప్రాణంపోసి, పెంచి పోషించే అనురాగమూర్తి ఆ అమృతమూర్తి.... కనీసం ఆ కాకిపిల్ల అదృష్టంకూడ నాకు దక్కలేదే!" వ్యాకులచిత్తుడై అనుకున్నాడు ప్రభు.

"ప్రభూ! చీకట్ని తిడ్తూ కూర్చునేకంటే ఒక క్రొవ్వొత్తి వెలిగించటం మేలు."

"సంజీవ్! పాచిపడితే చీపురు పట్టుకుని ఊడ్చిపారేస్తాం. చొక్కా మాసిపోతే మరో క్రొత్తది వేసుకుంటాం. కాని మమత, మమకారం అనేవి మాటలకి లభించేవికావురా."

"మనం మట్టిబొమ్మలం. విధి ఆడించే మరబొమ్మలం. మమత,

మమకారం అంటూ మీనమేషాలు లెక్కవేస్తూ కూర్చుంటే కరిగి పోతున్న కాలాన్ని పరుగులిడుతున్న కెరటాన్ని అందుకోలేం. ఈ ప్రపంచమనే నాటకరంగంలో మనం నటించవలసిన పాత్రకి న్యాయం చేకూర్చలేము" అంటున్న సంజీవ్, "ఎసీ హౌ ఐ యామ్ లక్కీ ఎనఫ్ టుహేవ్ సచ్ ఎ ఫ్రెండ్" అంటున్న ప్రభువైపు చూశాడు విచిత్రంగా. రెండు జతల కళ్ళు తృటికాలంపాటు కలుసు కున్నాయి. శోకదేవత కళ్ళనే మరిపిస్తున్న ఆ కళ్ళల్లోకి చూడలేక పోయాడు సంజీవ్.

"కన్నవారి ఆప్యాయతకి అనురాగానికి నోచుకోలేకపోయానే అని కుళ్ళిపోతున్న వాడి హృదయానికి బలమైన గాయం తలిగిననాడు గాని గతాన్ని మరువలేదు.... కాని ఆ హృదయంమీద దెబ్బతీయటం ఎలాగా?" అని ఆలోచిస్తున్న సంజీవ్ దృష్టి బ్యాట్ ఊపుకుంటూ క్రింద లాన్‌లో నడిచిపోతున్న కవితమీద పడింది.

"ప్రభూ! చైతన్యరహితమైన నీ జీవితంలో చైతన్యస్రవంతిని సృష్టిస్తాను. నీలో నిద్రాణమై యున్న కోర్కెల్ని మేల్కొలిపి నీ ఆలోచనల్ని నూతన మార్గాన పయనింపజేస్తాను" అనుకొని,

"ప్రభూ! అటుచూడు." అంటూ బ్యాటు పట్టుకొని లాన్‌లో నడుస్తున్న కవితని చూపించాడు. అర్థంగాక ప్రశ్నార్థకంగా చూశాడు ప్రభు.

"చక్కని సీతాకోకచిలుకలా మెత్తని ఆ గరికెమీద సుఖంగా నడుస్తున్న ఆమెను చూడరా!"

"సంజీవ్! ఆమె...."

"నో...ఆనందం అర్హతమైతే ఆనంద సంద్రాలకు వెళ్ళి తీర వలసిందే" అని.

"ప్లీజ్! ఆమె బొమ్మగీసివ్వు." అనడిగాడు.

"నేనా....!"

"అవును నీవే! ప్లీజ్ నా కోసం.... నేను నీ బెస్టు ఫ్రెండుని కదూ.... నీలాంటి ఆర్టిస్టు నా ఫ్రెండయినందుకు నేనెంత గర్వ పడుతున్నానో తెలుసా?"

"సంజీవ్!"

"రియల్లీ.... రేపు ఉదయానికల్లా ఆమె చిత్రం నాకివ్వాలి. ఓ.కె." అనంటున్న వాడివంక నిస్సహాయంగా జూసి "ఒక ఫ్రెండుగా నీ మాటని కాదనలేనురా....నా కిష్టం లేకున్నా నీ కోసం గీస్తాను." అని ఆమె వైపు పరిశీలనగా చూడసాగాడు.

బంగారంతో పోతపోసినట్లుగా చక్కని అవయవాలపొందికతో మూర్తీభవించిన కవిత రూపురేఖలు, ఆ చిత్రకారుని మదిలో పదిల మైన స్థానాన్ని సంతరించుకున్నాయి.

# 2

గోడగడియారం తొమ్మిది కొట్టింది.

డైనింగ్ హాలులోకి అడుగుపెట్టిన సంజీవ్ తన రాక కోసమే ఎదురు చూస్తున్న తండ్రినిచూసి, "సారీ...." అంటూ ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఏం బాబూ! అలా వున్నావ్?" పరిశీలనగా చూస్తూ అడి గారు రావుగారు.

"ఏం లేదు డాడీ!" సంజీవ్ డిష్ అందుకుంటూ అన్నాడు.

"ఏం లేదు" అని అతడన్నాడే గాని ముఖంలో దోబూచు లాడుతున్న భావరేఖల్ని చూసి దేనికో తీరని వ్యధ చెందుతున్నాడని అభిప్రాయ పడ్డారు రావుగారు. కాని 'ఏమిటది' అని అతణ్ణి వత్తిడి చేయక 'అదతని వ్యక్తి గత విషయం కాబోలు' అనుకున్నారు. 'ఏది ఏమైనా గుండెల్లో గుంభనంగా దాచుకుని బాధపడే కంటే నాతో చెప్తే తండ్రిగా కాకపోయినా ఒక స్నేహితునిగానైనా ఆ సమస్యకొక పరిష్కారాన్ని అన్వేషించేవాడ్ని' అని అనుకున్నారు.

సరిగ్గా సంజీవ్‌కూడ ఆ విషయంలో తండ్రి సలహా తీసు కోవటం మంచిదేమో అనుకున్నాడు. కాని ఆ విషయాన్ని ఎలా ప్రస్తావించాలో అర్థంగాక మౌనంగా ఉండిపోయాడు.

స్పూన్‌తో ప్లేటులో కెలుకుతున్నవాడ్నిచూసి, "ఆహారానికి వ్యవహారానికి ముడివేయటం తగదుబాబూ" అన్నారు.

"అదికాదు డాడీ! ప్రభూ..."

ప్రభు పేరు వినటంతోనే ఉలిక్కిపడ్డ రావుగారు, "ప్రభూ... ఏమైంది బాబూ?" ఆదుర్దాగా అడిగారు.

"తనకు దక్కనితల్లి ఒడిని, తండ్రి కౌగిల్ని తలచుకొని కుమిలిపోతుంటాడు."

"మనిషి భావకుడైతే మనస్సు విప్పి మాట్లాడుకోలేని విషయాన్ని మరువలేక, గోరంతదాన్ని కొండంతగా ఊహించుకొని కుమిలిపోవటం సహజం" అన్నాడు రావుగారు.

"డాడీ....తల్లి ప్రేమకు నోచుకోలేని నేను, తల్లీ తండ్రుల ప్రేమకు దూరమైన వాడి గుండెల్లో రగిలే సెగల్ని అర్థంచేసుకోగలను" అనంటున్న సంజీవ్ భోజనం దగ్గర్నుంచి లేచి వాష్‌బేసిన్ దగ్గరకెళ్తున్న తండ్రి వైఖరి అర్థంగాక చూశాడు.

"సారీ సంజీవ్....ఇదే సమస్య నాకు ఒకప్పుడు ఎదురయింది. కాని అప్పుడు నీలాగా నన్ను అర్థం చేసుకునే తండ్రి నాకులేడు. ఫలితంగా ఆ వ్యక్తి జీవితం నాకళ్ళ ముందే చితికిపోయింది." అనంటున్న రావుగారి కంఠం బాధతో పూడిపోయింది. చివరికి, "కాని మీనాన్న మా నాన్నలాంటి వాడుకాడు....నీ స్నేహితుడి జీవితంలో పున్నమి వెన్నెల ప్రవేశించాలి. ఏతండ్రి లేడని బాధపడ్తున్నాడో ఆ తండ్రిని మరిపింప జేయాటానికి కృషిచేస్తాను." అంటూ వెళ్ళిపోయారు.

తండ్రి వెళ్ళిన వైపే జూస్తూ, "డాడీ! మనిద్దరి మధ్యనున్నది తండ్రీ బిడ్డల అనురాగం కాదు. ఆప్తమిత్రుల అనుబంధం... మీ లాంటి వార్ని తండ్రిగా కలిగుండటం నా అదృష్టం" అనుకున్నాడు.

—సరిగ్గా అదే సమయంలో....

స్టడీ అవరయినా గణపతిశాస్త్రి గదిలో సమావేశమయ్యారు నాగరాజు తదితర్లు. వారందర్నీ చూడగానే శాస్త్రిలో కవితావేశం పెరిగింది. వెంటనే బెడ్ క్రింద నున్న వెన్నుండల డబ్బా వాళ్ళముందుంచి అంతకు గంటక్రితమే తాను వ్రాసిన కవిత్వని చేతిలోకి తీసుకున్నాడు. వారంతా కవిగారి కవితల్ని వింటానికి రావటం, వార్ని చూడగానే పిచ్చి కవిగారిలో కవితావేశం రావటం. వారాకవితల్ని విని అభినందించటం రోజూ జరిగేదే. కాని వారంతా పిచ్చికవిగారి సిగరెట్

ప్యాకెట్ ఖాళీ చేయటానికి, వాళ్ళమ్మగారు పంపిన వెన్నుండల్ని ఆర గించటానికి వస్తారనటం సమంజసం, వాస్తవం.

"నా పేరే ఓల్గా
నే చదివేదే అల్గా
ఓమైడియర్ మేరీ
సోసారీ విను నా స్టోరి" అని ఒక చరణం చదివాడు.

"ఏంటి గురూ! నీ లవ్ 'కవిత' అయితే 'ఓల్గా' మీద వ్రాశావ్?'' అడిగాడు నాగరాజు.

"యస్....కవిత, నా స్వీట్ హార్ట్. నా బెటర్ హాఫ్. ఆమె నా కవితా స్రవంతికి మూలం...." అనంటున్న వాడల్లా, "ఒరేయ్! వార్డెన్ వస్తున్నాడు" అన్న కేకకి ఈ లోకంలోకొచ్చి, "అయ్య బాబోయ్....త్వరగా మంచం క్రింద దూరండ్రా" అన్నాడు.

మరో రెండు నిమిషాల్లో ఆ గదిలో గణపతిశాస్త్రి తప్ప మరె వ్వరూ లేరు. అలాగని ఏవరూ బయటికెళ్ళలేదు.

కామన్ విజిట్ కొచ్చిన వార్డెన్ కుర్చీలో కూర్చునున్న శాస్త్రిని ముందు తెరిచున్న మూడు పుస్తకాల్ని చూసి, "నైస్ బాయ్" అను కుంటూ వెళ్ళిపోయాడు.

• • •

భుజంమీద చెయ్యి పడటంతో పుస్తకంలోనుంచి తలెత్తాడు ప్రభు.

"బొమ్మ గీశావా?'' అడిగాడు సంజీవ్

"ఉష్" అని మాట్లడొద్దు అన్నట్లుగా సంజ్ఞ చేసి, "పద" అంటూ రీడింగ్ రూమ్ రిఫరెన్స్ సెక్షన్ నుంచి బయటకు దారితీశాడు.

"రూమ్—లైబ్రరీ-క్లాసురూమ్, ఇవి తప్ప నీకు వేరే ప్రపంచం లేదనుకుంటాను." నడుస్తూనే అడిగాడు సంజీవ్.

"మెస్ హాలుంది" నవ్వుతూ అన్నాడు.

"ఇంకానయం బాత్రూమ్ ఉందనలేదు."

"అక్కడికక్కడా మ్యాగజైన్స్ తీసికెళ్తాగా" అంటూ ఫైలు లోని చిత్రం తీసిఇచ్చాడు.

"ఓ! వాట్ ఏ ఫైన్ ఆర్ట్..సృష్టికర్త ఈ చిత్రాన్ని చూస్తుంటే

ఆమెను మరింత కుందనపు బొమ్మగా మలచి జీవం పోసుందేవాడు" అన్నాడు.

"అదేంకాదు. ఆ సజీవ శిల్పాన్ని చూసే ఈ చిత్రం గీశాను."

"కాని, ఈ ఒంపు సొంపులు...." అని అర్థోక్తిలో ఆగిపోయాడు సంజీవ్.

"ఏం చేయను? ఆమెను స్పష్టంగా చూసింది విన్ననే. అదీ దూరంగానే...అందుకే సైడ్‌వ్యూ లాగాల్సి వచ్చింది." అంటూ క్లాస్ రూములోకి నడిచాడు.

సంజీవ్ చేతిలోని చిత్రం మరో రెండు కళ్ళకు పసందైన విందును చేసింది. ఆ కళ్ళు నాగరాజువి. వెంటనే పిచ్చికవిని వెదుక్కుంటూ బయలుదేరాడు నాగరాజు.

మిరపకాయ బజ్జీల ప్లేటు ముందు పెట్టుకుని, తెల్లని కాగితం మీద ఏవో గీకుతున్న పిచ్చికవిని చూడగానే నాగరాజు కళ్ళు వింత కాంతితో మెరిశాయి. మెల్లగా వెళ్ళి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. కాని పిచ్చికవి ఏ మాత్రం తలెత్తలేదు.

"గురూ! ఈ బజ్జీలేమిటి....ఆ వ్రాస్తున్నదేమిటి?" అడిగాడు నాగరాజు.

"విప్లవ కవిత్వం వ్రాస్తున్నాను....కదిలించకు గురూ!"

"ఓ అలాగే....నువ్విలాగే....మిరపకాయబజ్జీలు నముల్తూ విప్లవ కవిత్వం వ్రాస్తుండు. ఈలోపు ఆ ప్రభుగాదేమో గద్దలా కవితని తన్నుకుపోతాడు. అనక దేవదాసులా 'హా! కవితా!' అంటూ విరహ గీతాలు పాడుదువుగాని" అంటూ లేచినవాడ్ని, "గురూ...గురూ" అంటూ చెయ్యి పట్టుకుని ఆపి, "నీ చేతులు పట్టుకుంటాను... కాదంటే కాళ్ళు...అదీ కాదంటే బ్రెడ్‌జామ్ ఇప్పిస్తాను. 'కవిత' లేని నా జీవితం చంద్రుడు లేని రాత్రిలాంటిది. ఏం జరిగిందో చెప్పు?" బ్రతిమాలాడు పిచ్చికవి.

"నీ మూడ్ పోతుందేమో...."

"వెధవమూడ్ ఇప్పుడు పోతే మళ్ళీ వస్తుంది. కాని కవిత.." అంటూ "బోయ్ రెండు స్పెషల్ కాఫీ!" అని కేకవేశాడు.

అంతలో బెల్ మ్రోగింది.

"క్లాసుంది గురూ!"

"వెధవక్లాసు పోతే పోయింది. కాని నా కవిత..." అంటూ వెధవ పోజొకటి పెట్టాడు.

"అందుకేగా గురూ! నీ కోసం పరుగెత్తు కొచ్చింది" అంటూ కుర్చీలో కూలబడ్డాడు నాగరాజు. అంతలో బోయ్ కాఫీలు తెచ్చిముందు పెట్టాడు.

"ప్రభూ నీకు తెలుసుగా!" కాఫీకప్పు అందుకుంటూ అడిగాడు నాగరాజు.

"హిప్పీగాడేగా! తెలుసు."

"నీ లవ్...నీ స్వీట్ హార్ట్...నీ బెటర్ హాఫ్...."

"కవిత"

"యస్. ఆ కవిత బొమ్మగీశాడు."

"వాట్!"

"యస్. మినిస్కర్ట్, హాఫ్‌ఫాంటు వేసుకుని బ్యాట్ చేతబట్టు కున్నట్లు గీశాడు. ఎంత బాగుందంటే 'స్వయంగా కంగ్రాట్స్ చెప్పు దామా' అనిపించేంత బాగుంది. కాని ఆమె నీ 'లవ్' అని గుర్తు రావటంతో ఆగిపోయాను."

"థాంక్యూ...గురూ.." అని, "డామిట్! వాడికెంత ధైర్యం? నా కవిత బొమ్మనే గీస్తాడా?" పిడికిలితో టేబుల్ పగిలేలా గుద్దుతూ అడిగాడు.

"ఆఁ ఆఁ, ఈ వేళ ఆమె బొమ్మనే గీశాడు. రేపు ఆమెనే ప్రేమించేస్తాడు"

"కవిత ప్రేమించాలిగా?"

"మహచక్కగా ప్రేమిస్తుంది. ఒడ్డు పొడుగు ఎరుపు ఉన్న వాడ్ని ప్రేమించక నిన్ను ప్రేమిస్తుందా?"

"గురూ నా కాఫీ త్రాగుతూ నన్నే అపోజ్ చేయటం బాగాలేదు."

"శాస్త్రీ! నాగరాజంటే చేతలవాడే కాని మాటలవాడు కాదు."

"అయితే నాకిప్పుడు మార్గమేమిటి?"

"కవివి... ఆ మాత్రం తెలియదా? ఏ బొమ్మని చూచి కవిత

వాడ్ని ప్రేమిస్తుందను కుంటున్నామో, ఆ బొమ్మని ఎరగాపెట్టి వాడి మీద ద్వేషాన్ని పెంచు....అంతేకాదు. నీకు దగ్గరగా చేర్చుకో''

"థాంక్యూ గురూ!"

"నాగరాజు మాటలవాడుకాదు.... చేతలవాడే" అని, "క్లాసు కెళ్దాం పద...." అంటూ లేచాడు. అనుసరించాడు పిచ్చికవి.

ఇక్కడ పిచ్చికవి గురించి కొద్దిగా చెప్పాలి. పిచ్చికవిగారి అసలుపేరు గణపతిశాస్త్రి.నల్లగా, పీలగా, పొట్టిగా ఉంటాడు. పైపెచ్చు బట్టతలని కప్పటానికి ముందుకు దువ్విన జుట్టుతో కామెడీ ఫిగర్లా కన పడతాడు. ఎప్పుడో జి. శాస్త్రిపేరుతో ఒక మ్యాగజైన్లో కవితపడింది. ఆనాటినుంచీ గణపతిశాస్త్రి తననొక కవిగా పరిచయం చేసుకుంటాడు. కవిగారు అని ఎవరైనా పిలిస్తే అతడు ఒళ్ళుమర్చిపోవటం పరిపాటి. అందుకే అతన్ని పొగిడి ముచ్చటపడటం కొంతమందికి సరదా. అన్నిటికంటె విశేషమేమిటంటే అతను కవితను ప్రేమించటం.

* * *

లంచ్ టైము........

"నమస్తే" అన్నమాట వినిపించటంతో లేడిస్ వెయిటింగ్ రూమ్‌లోనుంచి వస్తున్న కవిత తలెత్తక తప్పలేదు. ఎదురుగ్గా చిరు నవ్వులుచిందిస్తూ నిల్చునున్నాడు పిచ్చికవి.

"నమస్తే కవిగారూ" అని, "ఇంకేమైనా కవితలు వ్రాశారా!" అనడిగింది.

"వ్రాయటానికి టైములేదండి. కాని మీలాంటి అభిమానుల్ని నిరాశపర్చటం నాకిష్టంలేదు." గుండెల్లోపొంగే సంతోషాన్ని మాటల్లో పెట్టాడు.

"అమ్మమ్మా.... మీరు కలం పట్టేవరకూ మేం ఊరు కుంటామా!" నవ్వుని పెదవులమధ్యే దాచుకుంటూ అన్నది.

"...." ఆనందాతిశయంతో మాటలే రాక మూగబోయాడు.

"సారీ ఏదో పనిమీద వెళ్తున్నట్లున్నారు.... వెళ్ళండి."

"అబ్బే.... లే.... లేదండీ, మీకోసమే గంటనుంచి వెయిట్ చేస్తున్నాను."

"వాట్! మీ అంతటి కవీశ్వరులు నాలాంటి అల్పురాలికోసం గంటసేపు వృధా చేశారా!" క్రీగంట్ల జూస్తూ అంది.

"అ....అదికాదండీ. ప్రభూ తెలుసుగా?"

"మన క్లాస్‌మేటేగా?"

"ఆఁ!....అతను మీ బొమ్మ గీశాడండీ."

"వాట్!"

"అవునండీ....మీరు బుష్‌షర్ట్. హాఫ్‌పాంటు వేసుకున్నట్లుగా గీశాడండీ."

"డామిట్!"

"అదేనండీ నా బాధల్లా. పెళ్ళిగాని ఆడపిల్లని అందునా హాఫ్ మ్యాడ్‌గా వేశాడంటే వాడికసలు మ్యానర్స్ తెలుసా అని."

"..........."

"ఈవేళ మీరు, రేపు మరొకరు....ఇలా అమ్మాయిల చిత్రాలన్నీ పేపర్లమీద కెక్కిస్తాడు ఇడియట్.వాడి రోగం కుదర్చాలండీ."

"అవును మరి కుదర్చకపోతే ఎలా?"

"వెళ్ళి ప్రిన్సిపాల్‌కి రిపోర్టివ్వండి."

అంతలో బెల్ మ్రోగింది.

"అరె టైమయిపోయిందే .... సారీ ఈ వేళ కెమిస్ట్రీ లాబ్...."

"మరి ప్రిన్సిపాల్ దగ్గరకో...."

"ఆఫ్టర్ క్లాస్...." అంటూ వడివడిగా అడుగులేసుకుంటూ వెళ్ళిపోయింది.

"ఒరేయ్ ప్రభూ! నీ ఆట కట్టు.... పాపం! ఈ రోజువరకు నీకు నా అన్నవాళ్ళెవరూ లేరు. ఇహ రేపట్నించి ఈ చదువుకునే అవకాశంకూడా వుండదు." అని,

"కవితా! నీవే ఈ భావకవి హృదయ సామ్రాజ్యానికి మహారాణివి" అనుకుంటూ కెమిస్ట్రీ లాబ్ వైపు నడక సాగించాడు.

కాలం కళ్ళెం తెగిన గుఱ్ఱంలా పరుగెత్తింది. బెల్ మ్రోగినా, కావాలనో లేక చేస్తున్న ఎక్స్‌పెరిమెంట్ పూర్తికాకనో సీటు వద లేదు కవిత. ఎలాగైతేనేం బెల్ మ్రోగిన పావుగంటకి అపరేటస్

కప్ బోర్డులో పెట్టి లాబ్ నుంచి బయటపడ్డ కవిత, స్టెప్స్ దగ్గరే తార ట్లాడుతున్న పిచ్చికవిని చూసి గతుక్కుమంది.

"అదేమిటి ఇంత ఆలస్యం చేశారు?" అన్నాడు పిచ్చికవి.

"ఎక్స్పరిమెంట్ పూర్తికాలేదు."

"ఓహ్! ప్రిన్సిపాల్ దగ్గరకెళ్దామన్నారుగా?"

"నా ఖర్మ. ఆ అన్నది నీవేగా." స్వగతంలా అనుకొని "మర్చేపోయానండీ." పెదవులపై నవ్వుని పులుముకుంటూ అంది.

"త్వరగా వెళ్దాం రండి."

"ఆఁ అలా చేసినందువల్ల ప్రయోజన ముంటుందంటారా?"

"..........." తెల్లమొఖమేశాడు.

"ఏముందండీ! ప్రిన్సిపాల్కి రిపోర్టిస్తాం....కాని ఆయనకి ప్రభూ అంటే చాలా మంచి అభిప్రాయముంది.... లేదంటారా మహా అంటే అయిదో పదో ఫైన్ అంటారు, అంతే."

"అదీ పాయింటే!"

"అందుకని నేనే స్వయంగా వెళ్ళి మొఖం వాచేలా చీవాట్లు పెడతాను."

"వెరీనైస్....కాఫీ త్రాగి వెళదామా?"

"నో, థాంక్యూ...." అని వడివడిగా అడుగులు ముందుకు వేసింది.

"వెళ్ళేటప్పుడు మా రూమ్కి తప్పకుండా రండి....వెయిట్ చేస్తుంటాను"

"ఖర్మరా బాబూ!" స్వగతంగా అనుకుని, "అలాగే" అంటూ నడక సాగించింది.

ప్రభు రూమ్ దగ్గరవుతున్నకొద్దీ ఆమె కాళ్ళు తడబడ సాగాయి. ఏదో తెలియరాని భయం ఆవహించింది. అంతలో ప్రభు రూమ్ రావటంతో ఆమె కాళ్ళు పనిచేయటం మానేశాయి. ఏం చేయాలో తోచక అలాగే డోర్ ముందు నిలబడిపోయింది. చివరకు శక్తినంతా కూడగట్టుకుని డోర్మీద చెయ్యి వేసింది. డోర్ దగ్గర వేసుంది కాబోలు వెంటనే తెరుచుకుంది. ఎదురుగా తెల్లని మల్లెపూవు

ల్లాంటి పైజామా, లాల్చీతో, భుజాలమీదకు పడుతున్న శిరోజాలతో బాదం చెక్కతోచేసిన సితార్ వొడిలో ఉంచుకుని కనిపించాడు ప్రభు.

ఎఱ్ఱనిచీర కట్టుకుని, వదులొదులుగా వేసుకున్నజడలో తెల్లని గులాబీని తురుముకొని పాలరాతి బొమ్మలా ద్వారాని కడ్డంగా నిలబడున్న కవితను చూసి అవాక్కయిపోయాడు. సితార్ తంత్రుల మధ్య కదులాడుతున్న మృదువైన వ్రేళ్ళు అప్రయత్నంగా ఆగిపోయాయి. భావరేఖలు దోబూచులాడవలసిన ఫాలభాగాన చిరు చెమటలు స్థానమేర్పరచుకుంటున్నాయి.

ఏదో మాట్లాడాలని నోరు తెరవబోయాడు. కాని గొంతు పెగలలేదు.

అతని పరిస్థితి గమనించి కాబోలు చిన్నగా నవ్వుకుంటూ వచ్చి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

ఒడిలోని సితార్‌ని ప్రక్కన పెట్టాడు.

"నా పేరు కవిత...." సన్నాయి స్వరంలా వినిపించాయా మాటలు ఆమె నోట. 'తెలుసు' అన్నట్లుగా తలూపాడు.

తిరిగి ఇద్దరి మధ్య తుఫానుకు ముందావరించుకున్న ప్రశాంతతలా నిశ్శబ్దం ఆవరించుకుంది.

ఆ గదిని పరికిస్తున్న ఆమె కళ్ళు మూలగా పెట్టబడున్న స్టాండుమీద గల కలర్‌ప్రేమ్ మీద నిలిచాయి.

"మీరు విద్వాంసులేగాదు చక్కని చిత్రకారులు కూడనన్నమాట."

ప్రక్కన పిడుగు పడినట్లుగా అదిరిపడ్డాడు ప్రభు. తాను గీసిన ఆమె చిత్రం మదిలో మెదలగా చిన్నబోయి కూర్చున్నాడు.

"నా బొమ్మ గీయగలరా?" అన్న ఆమె ప్రశ్న అతని గుండెల్ని పిండింది.

మూగబోయినవాడిలా కళ్ళప్పగించి చూస్తుండిపోయిన ప్రభును ఉద్దేశించి—

"ప్లీజ్....నా చిత్రం గీయగలరా?" తిరిగి అడిగింది.

"నా....ది....తప్పేనండీ?"

"ప్రభూ! వికసించిన పుష్పాన్ని చూడగానే తుమ్మెద వాలుతుంది. ఆహ్లాదమైన వాతావరణాన్ని చూడగానే గాయకుడు నోరు



విప్పుతాడు. హృదయరంజకమైన దృశ్యాన్ని చూడగానే చిత్రకారుడు కుంచెల్ని అందుకుంటాడు. అది లోక సహజం. పువ్వు కొమ్మనున్న కొద్దిసేపే కళకళలాడుతుంది. కాని కొమ్మనుంచి వేరుచేయబడగానే వాడు ముఖం పడ్తుంది. అలాగే స్త్రీ తన సౌందర్యాన్ని నిగూఢంగా ఉంచుకున్నంత కాలం శోభిస్తుంది. బహిరంగపరిస్తే వెగటు కలిగిస్తుంది." ఆమె మాటలకు చిత్తరువులా కూర్చుండిపోయాడు ప్రభు.

సితార్‌ని చూపిస్తూ, "ఈ తీగ కొన్ని ప్రకంపనాలని మాత్రమే భరించగలదు.అటు పిదప తెగిపోతుంది. అలాగే స్త్రీ...."అంటూ అర్థోక్తిలో ఆగిపోయింది. ఆమె మాటల అంతరార్థమేమిటో అర్థంగాక ఉండిపోయాడు ప్రభు.

"ప్లీజ్! నా బొమ్మ గీయండి....హాఫ్‌పాంటుగాదు. చీరలో వేయండి. వేస్తారుగదూ?" అంటూ లేచి—

"ఓకె....గుడ్‌బై!" అని బైటకు నడిచింది.

ఆమె వెళ్ళిన అయిదు నిమిషాలకుగాని ఆ షాక్‌నుంచి తేరుకోలేదు ప్రభు.

తాను చేసిన వెధవపనికి ఎంత మర్మగర్భంగా చివాట్లేసింది!

స్త్రీ తన సౌందర్యాన్ని నిగూఢంగా ఉంచుకున్నంతకాలం శోభిస్తుంది. బహిరంగపరిస్తే వెగటు కలిగిస్తుంది. అంటే తననలా హాఫ్‌న్యూడ్‌గా చిత్రించి నలుగురి దృష్టిలో తేలికపర్చవద్దనేగా ఆమె మాటల అర్థం.—

"ఈ తీగ కొన్ని ప్రకంపనాలని మాత్రమే భరించగలదు. అటుపిదప తెగిపోతుంది.అలాగే స్త్రీ అంటే సున్నితమైన మనస్సు అని ఆ మనస్సు విరచొద్దనేగా ఆ మాటల అర్థం" అనుకున్నాడు ప్రభు.

సరిగ్గా అరగంట తర్వాత....

"రండి....రండి. మీకోసమే ఎదురుచూస్తున్నాను" ఆహ్వానించాడు కవి కవితను.

ఈసురోమంటూ ఇష్టంలేకున్నా సభ్యతకోసం అతన్ననుసరించింది.

"అరె! ఏమిటివన్నీ?...." ప్లేట్లోని బిస్కట్స్ మిక్చర్‌వంక ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది కవిత.

"మీరొస్తున్నారని. ఇక్కడ కూర్చోండి." అంటూ కుర్చీ చూపించాడు.

"పర్వాలేదులెండి." అంటూ బెడ్‌మీద కూర్చుని "మీరు మరీ టూమచ్‌గా బిహేవ్ చేస్తున్నారు" అంది.

"మీరంటే నాకెంత గౌరవమో మీకు తెలియదు."

"మీరు మంచివాళ్ళుగనక అలాగనిపిస్తుంది" అని వాచ్‌వంక చూస్తూ, "సారీ! చాల అర్జంట్ పనుంది" అంటూ లేచింది.

"అయ్యో! టిఫిన్ తీసుకోండి."

"మరో తఫా...."

"అధమం కాఫీ అయినా...."

"ప్లీజ్! ఫ్రెండ్ వెయిట్ చేస్తుంటుంది" అంటూ బయటకు నడిచింది.

"మళ్ళీ తప్పకుండా వస్తారుగా?" ఆమె వెళ్తున్న వైపే చూస్తూ అడిగాడు. కాని ఆమె మాత్రము బదులు పలకకుండా వెళ్ళిపోయింది. ఆమె కనుమరుగవగానే, "హ! కవితా! ఎన్నాళ్ళకి ఈ దీనుడి మీద దయగల్గింది" అనుకుంటూ బెడ్ సమీపించి, "ఇక్కడే నా కవిత కూర్చుంది" అనుకుంటూ బెడ్‌మీద వాలిపోయి ఊహాలోకంలో తేలిపోసాగాడు పిచ్చికవి. అలా ఎంతసేపున్నాడో గాని, "ఒరేయ్ కవీ!" అని ఎవరో తట్టినట్లుంటే కళ్ళు తెరిచాడు. ఎదురుగ్గా నాగరాజు తదితర్లు నిలబడున్నారు.

"ఏమిట్రా ఇప్పుడు నిద్రబోతున్నావ్?" అన్నాడు నాగరాజు.

"నిద్రా....ఇంకా నయం....డ్రీమ్‌వరల్డ్‌లో విహరిస్తున్న వాణ్ని డిస్టర్బ్ చేశావ్."

"ఈ బిస్కట్లూ గట్రా చూస్తుంటే...."

"విశేషమేఉంది. ఈవేళ నా స్వప్నసుందరి నన్ను కనికరించి నా గదికి వేంచేసింది."

"అయితే జాక్‌పాట్ కొట్టావన్నమాట."

"అన్నమాటగాదు ఉన్నమాటే."

"ఇంకా ఏమందిరా?"

"నేను చాల మంచివాడ్నట. నాలాంటి గొప్పవాడితో పరిచయ భాగ్యం కలగటం అమ్మో అదృష్టమట. నేను రచనలకి స్వస్తి చెప్తే కలంపట్టేవరకు నా గదిలోనే తిష్ట వేస్తుందట."

"అమ్మో! మన కవిగాడు నక్కను తొక్కాడన్నమాటే!" ఎవరో అన్నాడు.

"అయితే ఈ వేళ మనందరికీ స్పెషల్స్ తిపిపిస్తున్నాడన్న మాట" మరెవరోవంత పలికారు.

"మరి మన కవిగాడి స్పెషాలిటీ అదేగదరా" అని "బయలు దేరండ్రా" అన్నాడు నాగరాజు.

పిచ్చికవిగాణ్ని మెస్‌హాలు వైపు మోసుకెళ్ళినంతపని చేశారు మిత్రబృందం.

# 3

"సంజీవ్" అన్న పిలుపుతో స్టెప్స్ ఎక్కుతున్న వాడల్లా దిగొచ్చాడు.

సోఫాలో కూర్చునున్న రావుగారి కెదురుగా నిలబడ్డాడు.

"కూర్చో" అంటూ సోఫా చూపించారు.

మారు మాట్లడకుండా కూర్చున్నాడు.

"సంజీవ్ చేతిలోని చిత్రాన్ని జూసి, "ఏమిటది?" అంటూ చెయ్యి చాచిన రావుగారి కందించాడు సంజీవ్. అది ప్రభు గీసిన కవిత చిత్రం.

"ఈమె....?"

"మా క్లాస్‌మేట్..."

"ఎవరేశారు?"

"ప్రభు."

ఇహ మాట్లడటానికి మాటలే లేవు అన్నట్లుగా మౌనంగా

ఉండి పోయారు రావుగారు. దీర్ఘాలోచనలో నిమగ్నులైయున్న రావుగార్ని జూసి వ్యాకుల చిత్తుడై "డాడీ!" అని పిలిచాడు సంజీవ్.

"ఏమిటి?" అన్నట్లుగా తలెత్తారు రావుగారు.

"ప్రభూని నేనే ఈ బొమ్మగీయమని అడిగాను" తప్పుచేసిన వాడిలా తలదించుకుంటూ అన్నాడు.

"ప్రభుకి ఆరాధన తప్ప అనురాగం తెలియదు. ఆవేదన తప్ప అనుభవాన్ని రుచిచూడలేదు. ఎంతసేపూ ఊహాలోకంలో తేలియాడు తుంటాడేగాని కళ్ళుతెరిచి పరిసరాల్ని గుర్తించడు." అన్నారు రావుగారు

"రిక్త హస్తాలతో శూన్యాన్ని భేదించటానికి యత్నిస్తున్న వాడ్ని ఈ లోకంలోకి తీసుకురావాలనుకున్నాను. అతని గుండెల్లో పేరుకుపోయిన స్తబ్దతని పటాపంచలుచేసి, కన్నతల్లి ఒడి జీవితంలో ఒకభాగమేనని, అర్ధాంగి కౌగిలి అన్నిటిని మరిపిస్తుందని తెలియ జెయ్యాలనుకున్నాను" అన్నాడు సంజీవ్. రావుగారు గాఢంగానిట్టూర్చి "సప్తసముద్రాలనైనా ఔపోశనం పట్టవచ్చునేమోగాని స్త్రీ అంతర్యాన్ని అవగతం చేసుకోలేం. ప్రేమరాహిత్యంలో బ్రతుకుతున్నవాడ్ని ప్రేమ పాశంలో బంధించాలని శుష్కప్రయత్నం చేస్తున్నావ్! స్త్రీ సంగ మాన్ని చవిచూడనివాడికి స్త్రీ సౌఖ్యాన్ని అందించాలని యత్నిస్తు న్నావ్! అతడు భావకుడు. అతనికి కావలసింది బిగికౌగిలికాదు. అతని జీవితంలో ఒకే ఒక్కసారి ఒకే ఒక్క వ్యక్తికి హృదయాన్ని అర్పించగలడు. కాని ఊహాసౌదాలలో నివసించే ఆ వ్యక్తిని ఆ స్త్రీ చేరుకోలేకపోవచ్చు. ఆనాడు ఆ రసకల్లోలిత కళాహృదయం అను భవించే చిత్రవధ అనూహ్యం. ఈనాడు కన్నవారు లేరే అని ఇంకగా తపించిపోతున్న వ్యక్తి, రేపు ప్రియురాలి ఎడబాటుని ఎలా తీసు కుంటాడో ఆలోచించు!" అన్నారు రావుగారు.

"అర్థమయింది డాడీ!" అంటూ లేచాడు సంజీవ్.

• • •

"సారీ సంజీవ్! నేను రాలేను" అన్నాడు ప్రభు.

"ఏం. ఎందుకని?"

"ఇప్పటివరకు నేను పెరిగిన కాన్వెంట్ని, ఈ హాస్టల్ని దాటి ఏ ఒక్కరింటికి వెళ్ళి ఎరుగను."

"అదే, ఎందుకని అడుగుతున్నాను."

"ప్రీ ఇంటికొస్తాను....మీ తల్లి దండ్రులు చూపే ఆదరణని, ఆప్యాయతని చూసి అమ్మానాన్న ఉంటే నాకూ ఇంత ఆప్యాయత దక్కుండేది కాబోలని కుమిలిపోతాను. అంతేగా?"

"ప్రభూ! కేవలం రక్తమాంసాల్ని పంచి ఇచ్చినంత మాత్రాన తల్లీ, జన్మ నిచ్చినంత మాత్రాన తండ్రీ కాలేరు. రూపాన్నిచ్చి నంత మాత్రాన వారి బాధ్యత తీరిపోయిందనుకుంటే ఈ సృష్టిలో మనుషులకంటే జంతువులు, వృక్షాలే నయమని చెప్పాలి.

"కోకిలపిల్ల కాకిదగ్గర పెరుగుతుందన్న సత్యాన్ని మరువవద్దు. త్రాగటానికి నీళ్ళు దొరకలేదని చేతులు ముడ్చుకుని కూర్చోము....బావి త్రవ్వుతాం. అలాగే ఎవరూ లేరని బాధపడ్తూ మూలన కూర్చునేకంటే సుఖాల్ని వెతుక్కుంటూ బయలుదేరు."

"సంజీవ్...."

"నో...ఫర్దర్ టాకింగ్....ఫాలో మీ" అంటూ క్లాసురూం వైపు నడిచాడు సంజీవ్. మారుమాట్లాడకుండా నడిచాడు ప్రభు. బెల్ మ్రోగిన అయిదు నిమిషాల లోపునే వచ్చారు లెక్చరర్. లెక్చర్ జోరుగా సాగుతుంది. అంతలో ఎవరో ముందున్న చెప్పుని కాలితో బలంగా తన్నటంతో అది జర్రున జారుకుంటూపోయి లెక్చరర్ కాలుని ముద్దుపెట్టుకుంది. కాలికి తగిలిన చెప్పువంక అర్థంగాక చేష్ట లుడిగి చూస్తుండిపోయిన లెక్చరర్ ఎవరో పక్కున నవ్వటంతో ఈ లోకంలో కొచ్చారు.

"గాడిద...." అన్న మాట ఆయన నోటినుంచి రాగానే "ఎక్కడ సార్?" అనడిగాడు పెద్దబ్బాయి అని పిలవబడుతున్న మొద్దబ్బాయి.

"షటప్...."

"కిటికీలో?" అడిగాడు నాగరాజు.

"స్టాండప్" అనగానే బెంచీ ఎక్కి నిలబడ్డాడు నాగరాజు.

"ఒరేయ్, దిగరా. నిన్ను బెంచీ ఎవరెక్కమన్నారు?"

"'అప్' అన్నారు గదండీ.... ఇంతకంటే పైకైనది కనిపించ

లేదు.... పోనీ బిల్డింగ్ ఎక్కమంటారా?'' బెంచీ దిగుతూ అడిగాడు నాగరాజు.

"ఒరేయ్ నోరు మూసుకుని కూర్చో." అని "ఏ అడ్డమైన వెధవరా చెప్పు విసిరింది?" అనడిగాడు. నవ్వుతూ చెప్పుల్లోకి కాళ్ళు పెడుతున్న పిచ్చికవి కాలికి ఒక్క చెప్పు మాత్రమే తగలడంతో వాస్త వానికొచ్చి క్రిందికి జూశాడు. ఒంటరి చెప్పు వెక్కిరిస్తూ కనిపించ టంతో, ''సార్ నా చెప్పు" అని అరిచాడు.

''షటప్....ఫస్ట్ గెటప్"

"ఎందుకు సార్?" విల్చుంటూ అడిగాడు.

''చెప్పు ఇక్కడికెలా వచ్చిందో చెప్పు?"

"అదే చెప్పండి సార్?"

"షటప్....అడ్డ గాడిదా?"

"సార్....మర్యాదగా మాట్లాడండి. ఇక్కడ గాడిదలెవ్వరూ లేరు."

"ఒరేయ్....నీ వయస్సంతా కలిపినా నా సర్వీసంత లేదు. నన్నే వ్యతిరేకిస్తావ్రా"

"మీరెంత గొప్పవాళ్ళయినా 'అరేయ్....ఒరేయ్' అనటం బాగుండలేదు."

"ఫస్టు గెటవుట్"

"సార్.... నేనేం బేవార్స్‌గా వచ్చి కూర్చోవటం లేదు.... కూర్చుంటున్నందుకు ఫీజు కడుతున్నాను. మీరు తినే తిండి.... ఐ మీన్ మీరు తీసుకునే జీతం మా నాన్న చెమటోడ్చి సంపాదించింది. మీరు 'వెళ్ళ'మనగానే వెళ్ళటానికి 'రా' అనగానే రావటానికి ఇక్కడెవరూ లేరు."

"ఒరేయ్.... నీ తాట వొల్చేస్తాను."

"ఇన్సల్ట్ .... నా చెప్పు పోయిందని నేను కంప్లెయింట్ చేస్తే నా తాట వల్చేస్తానని అవమానిస్తారా?"

"నీ చెప్పు ఇక్కడికెలా వచ్చింది?"

"నాకేం తెల్సు సార్.... చదువు దగ్గర కూర్చునే టప్పుడు చెప్పులు విడవమని మా అమ్మమ్మ చెప్పింది. అలాగే చేసాను.

ఎవరో విసిరింది దానికి నేనా బాధ్యుడ్ని?" అందరూ ఘొల్లున నవ్వారు.

"సైలెన్స్" అని అరిచి "నీ చెప్పుల్ని జాగ్రత్తగా దాచుకోవటం నీ విధి..... నీ విధిని నీవు నిర్వర్తించలేవు.... అందుకే గెట వుట్" అన్నారు.

"ఇన్సల్ట్.... నాకు చెప్పులు విడుచుకునే హక్కుంది. నా ప్రాధమిక హక్కునే కాదని ఇంతమందిలో నన్ను అవమానించారు. సరే, మీకుగా మీరొచ్చి బ్రతిమాలే వరకు క్లాసుకే రాను. అంతేగాదు ఆమరణ నిరాహార దీక్ష జరుపుతాను" అంటూ బయలుదేర బోతున్న వాడల్లా "ఆగు...." అనగానే ఆగిపోయాడు పిచ్చికవి.

"చెప్పండ్రా.... చెప్పు విసిరిందెవరు? తప్పొప్పుకుంటే నేనేమీ అనను. లేకుంటే ఏం చేస్తానో తెలుసా?" అని ఆగిపోయారు లెక్చరర్. అందరూ నవ్వుతున్నారే గాని బదులు చెప్పలేదు.

"ఒరేయ్ మీరిలా మంచిగా చెప్పరుగా... సరే మీ ఖర్మరా!" అంటూ పుస్తకాల్ని పట్టుకొని "చేసిందానికి తప్పేనని మీరంతా ఒప్పుకునే వరకు నేను మీ క్లాసు తీసుకోను" అని బయటకు నడిచాడు లెక్చరర్.

♦ ♦ ♦

కారు పోర్టికో ముందు పార్కు చేసి దిగాడు సంజీవ్. వెనుక మెల్లగా దిగాడు ప్రభు లోపలి హాలులోకి అడుగు పెట్టగానే చల్లని శీతల వాయువొకటి వార్ని చుంబించింది. మొజాయిక్ ఫ్లోర్ మీద ఎర్రని కార్పెట్స్ పరచబడున్నాయి. గోడలకు చక్కని తైలవర్ణ చిత్రాలు అలంకరింపబడున్నాయి. హాలు మధ్యలో సోఫాలు వేయబడున్నాయి. స్టెప్స్ ఎక్కుతున్న ప్రభు భగవద్గీత చేతిలో పట్టుకొని షాల్ కప్పుకొని తనవంకే చూస్తూ నిలబడున్న వ్యక్తిని చూడగానే అప్రయత్నంగా ఆగిపోయాడు.

స్టెయిర్ చేరుకున్న సంజీవ్ "డాడీ! ఇతనే...." అంటూ వెనుతిరిగిన వాడల్లా, స్టెప్స్ మధ్యలోనే నిలబడున్న ప్రభును చూసి "ఆగిపోయావేం? రా!" అన్నాడు.

"రా బాబూ!" అహ్వానించారు రావుగారు.

మంత్ర ముగ్ధునిలా పైకి చేరాడు ప్రభు.

"ప్రభూ! వీరే మా నాన్నగారు." చటుక్కున వంగి పాదాల్ని తాకుతున్న ప్రభుని "బాబూ" అంటూ భోదివి పట్టుకొని లేవనెత్తి మెల్లగా సోఫా దగ్గరకు నడిపించుకెళ్ళి ప్రక్కనే కూర్చోబెట్టారు.

భోదివి పట్టుకోవటంలో ఏదో తెలియరాని ఆనందం ప్రభు మనస్సుకి హాయిని కల్గించింది.

"నీ గురించి చాలా విన్నాను బాబూ!" ప్రేమగా వీపు నిము రుతూ అన్నారు రావుగారు. ఏం మాట్లాడాలో తెలియక మూగగా కూర్చుండిపోయాడు ప్రభు.

కళ్ళజోడు తీసి అశ్రుపూరితమైన నేత్రాల్ని తుడుచుకుంటున్న తండ్రి వంక వింతగా చూశాడు సంజీవ్.

"బాబూ! తల్లి పోయేనాటికి సంజీవ్ పొత్తిళ్ళలో బిడ్డ.... తన ఆకలి తానెరుగని ఆ పసివాడ్ని పెంచి ఇంత వాణ్ణిచేసాను. ఈ వేళ తనకి తండ్రయినా, తల్లియినా స్నేహితుడయినా నేనే. చిన్న తనంలో తనతో పాటు గెంతాను. మరి కొంతకాలం తనతో పాటు ప్రతి చిన్నదాన్ని ఆశ్చర్యానందాలతో చూసాను. ఈ వేళ తను చెప్పే ప్రతిదాన్ని ఆలోచిస్తాను. నేను తనకి తండ్రి నన్న సంగతి బహుశా మర్చిపోయుంటాడు. మా ఇద్దర్నీ తండ్రీ కొడుకుల సంబంధం కంటే ప్రాణ మిత్రుల అనుబంధం పెన వేస్తుంది. ఈ నాడు ఏ విషయాన్ని గురించైనా స్వతంత్రంగా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకోగల సామర్థ్యం తనకుంది. నడుం కట్టి ముందుకడుగేసి ఏ విషయాన్నైనా చక్కదిద్ద వలసిన తరుణం ఇది. అలాటిది ఈ తరుణంలో అమ్మా నాన్న అంటూ ఆక్రోశిస్తూ కూర్చుంటే...."

"మీరు చెపుతున్న విషయం నా కర్థమయింది. కాని వీణ అంతటి వాయిద్యం కూడ సొరకాయ బుర్ర లేకుండా రమ్యంగా పలక లేదు"

"అర్థం గాలేదు బాబూ!"

"ఎప్పుడయినా మీరు చదివింది, విన్నది, చూసింది కాని విష యాన్ని గురించి ఆలోచించారా?" ఎదురు ప్రశ్న వేశాడు ప్రభు.

"లేదు."

"మానవ జీవితం అంతే. ప్రతివ్యక్తి ఆలోచనలు ఒక నిర్ణీత

మైన పరిధిలోనే ఉంటాయి. ఆ పరిధిని దాటటానికి అతనికెంతో ఆత్మ స్థైర్యం, అనుభవం అవసరం.అవి లేనంతకాలం అతని ఆలోచనలు ఆ పరిధిలోనే పరిభ్రమిస్తాయి. నేను ఎవర్నో, ఎక్కడ పుట్టానో ఎరగను. కాని ఒక కాన్వెంట్‌లో అనాథగా పెంచబడ్డాను. నా పాతికేళ్ళ పరిజ్ఞానం పుస్తకాలకి, సితార్ తంత్రులకి, కుంచెలకి మాత్రమే పరిమితమైంది. కాని నా అంతరంగం మాత్రం మానవత్వపు పరిధుల్ని అధిగమించి మమకారపు పొరల్ని తెరచి మాతృగర్భపు తీయ్యదనాన్ని చవిచూడాలని వేగిరపడుతుంది. నా గతజీవితంలోకి ఒక్కసారి వెనుదిరిగిచూస్తే నాకు కనిపించేవి మెట్ట పల్లాలు, ముళ్ళ తుప్పలు, మృగతృష్ణలేగాని ఒయాసిస్సులుగాదు .... కాని నాకు తెలియకుండానే నాబ్యాంక్ బాలన్స్ పెరిగిపోతుంది. నా అన్న వారులేని నాకు అది ఎలావస్తుందో ఆలోచించండి. నా స్థానంలో మిమ్మల్నొక్కసారి ఊహించుకుని నా జన్మ...."

"బాబూ!" అంటూ బాధగా కళ్ళుమూసుకుని, "ఒకనాడు నా హృదయం అనుభవించిన చిత్రవధ వర్ణనాతీతం. జీవితంలో ఎదురయ్యే ఆటుపోట్లుని వెతుక్కోవటంలోనే ఆనందముంది" అనంటున్న వాడల్లా . అంతలో ఫోను గణ గణమని మ్రోగటంతో తృటికాలంపాటుఆగి."బాబూ! స్వర్గమంటే ఎక్కడో ఉందని, ఆనందమంటే ఎవరి ఒడిలోనో దాగుంటుందని అనుకోకు. నీకు కనిపించే ఈ లోకాన్నే స్వర్గంగా మలచుకో.... నీ చుట్టూవున్న వ్యక్తుల్లోనే ఆత్మీయత అనురాగాల్ని వెదుక్కో.... తల్లిదండ్రులు లేరని బాధ పడవద్దు. నీవూ, సంజీవ్ నాకు రెండు కళ్ళలాంటివారు అర్థమయింది గదూ!" అని వీపుతట్టి ఫోనుదగ్గరకి నడిచారు రావుగారు.

# 4

"ఫ్రోర్‌శబ్దమయిందో లేదో చేతిలోని పుస్తకాన్ని గాభరాగా తలగడ క్రింద దాచేశాడు పెద్దబ్బాయి అని పిలవబడుతున్న మొద్దబ్బాయి. కాని లోపలికి అడుగుపెట్టిన పిచ్చికవినిచూసి గుండెలనిండా గాలి

పిల్చుకుని "సీవత్రా!" అంటూ దిండుక్రింద దాచిన పుస్తకాన్ని చేతి లోకి తీసుకున్నాడు. అట్ట మీదున్న నగ్నసుందర్నిచూసి, "ఏమిత్రా ఇది?" క్వశ్చన్ మార్కు ముఖంపెట్టి అడిగాడు పిచ్చికవి.

"ఏమిటా.... సెక్స్ పత్రిక..."

"ఇడియట్, సెక్స్ పుస్తకాల్ని చదువుతున్నావ్!... నీకు బుద్ధుందా?"

"హుఁ!" అని నిట్టూర్చి "యోగి కానివాడు.... సారీ, భోగి కానివాడు యోగి కాలేడంటారు. తెలియదా?" అనడిగాడు.

"ఒరేయ్ నాకే మస్కా కొట్టాలని చూస్తున్నావా?"

"పిచ్చి నాన్నా!'పంకజం'....అంటే తామరపువ్వు బురదనుండి పుట్టుందన్న సత్యాన్ని మర్చిపోకు"

"ఏమిత్రా.... ఏమిత్రా.... మళ్ళీ చెప్పు!" కుతూహలంగా అడిగాడు.

"ఒక్కనిమిషం" అని టేబుల్‌మీదున్న సిగరెట్ అందుకుని వెలిగించి. "ఏ రచయిత అయినా తన రచన సందేశాత్మకంగా ఉండా లను కుంటాడు. అవునా?" అనడిగాడు.

తలూపాడు.

"పాఠకుల హృదయన్ని కదిలించాలంటే.... సంఘంలో అట్టడుగున పడున్న వ్యక్తులగాథల్ని తీసికోవాలి, తెలిసిందా?" అనడి గాడు.

'చెప్పు' అన్నట్లుగా చూశాడు పిచ్చికవి.

"జీవితాన్ని వడగాచిన వ్యక్తులుగాని అలాటి రచనలు చేయ లేరు. కాని నీకది అసాధ్యం. అందుకే ఈ పుస్తకం చదవ మంటున్నాను"

"ఏమిటి, ఇదా? అమ్మాయి.... అబ్బాయీ, కౌగలింతలూ.... అవేగా అందులో ఉన్నవి."

"అదే పొరపాటు.... అన్నీ అలాటివే ఉండవు. అందులో వేశ్యల జీవితగాథలు, వారితో ఇంటర్వ్యూలు ఉన్నాయి. అది చదివితే ఆమె ఎలాటి పరిస్థితిలో వేశ్యావృత్తి అవలంబించవలసివచ్చిందో

తెలుస్తుంది. దానినే ఇతివృత్తంగాతీసుకో.ఎంతచక్కని రచన వెలుగు లోకి వస్తుందో చూడు."

"నిజంగానా....!"

"ప్రయత్నించిచూడు." అంటూ ఆ సెక్స్ పుస్తకం ఇచ్చాడు.

పాశుపతాస్త్రం అందుకున్న అర్జునుడిలా ఆ పుస్తకం తీసుకుని బయలుదేరాడు. టేబుల్ముందు కూర్చుని 'సెక్స్' పుస్తకాన్ని ఆర్గానిక్ కెమిస్ట్రీ నోట్సులోపెట్టి చదువుతున్న పిచ్చికవి అడుగుల సవ్వడికి ఈ లోకంలోకొచ్చి తలెత్తాడు. ద్వారం దగ్గర నిల్చునున్న వార్డెన్ కనిపించారు. వెంటనే పుస్తకాన్నిమూసి "రండి....రండి" అంటూ కుర్చీలోనుంచి లేచాడు. "నో....నో....మైండ్ యువర్ బిజినెస్"అని"సారీ ఫర్ ది డిస్ట్రబెన్స్" అంటూ ముందుకడుగేశాడు.

విజయగర్వంతో తలని ఆ పుస్తకంలోకి దూర్చాడు పిచ్చికవి.

కాని వార్డెన్మాత్రం మనసులోనే "నైస్ బోయ్" అను కున్నారు.

* * *

"వాట్ ఎ ఫైన్ డిస్సెక్షన్" అన్న మాటలు వినరాగా డిస్సెక్షన్ అపరేటస్ని కాటన్తో క్లీన్ చేస్తున్నవాడల్లా తలెత్తక తప్పలేదు. తననే పరికిస్తున్న ఆమె వైపు చూడలేక దృష్టిని ప్రక్కకు త్రిప్పుకున్నాడు ప్రభు. నీడిల్తో బ్లడ్ వెసల్స్ కొద్దిగా లేవనెత్తుతూ, "నా చిత్రంగీశారా?" లోస్వరంతో అడిగింది కవిత.

అంతలో లెక్చరర్ పిలవటంతో "రేపు ఆదివారం.... ఖచ్చి తంగా రెండుగంటలకొస్తాను" అని సమాధానం కోసమైనా ఎదురు చూడకుండా లెక్చరర్వైపు నడిచింది.

"ఏం? అప్పుడే మీ బ్యాచ్ వదిలేశారా?" రికార్డుమీద సంతకం పెడ్తున్న లెక్చరర్ అడిగారు.

"ఈ వేళ ఫ్లవర్ సెక్షన్ కటింగ్ కదండీ, త్వరగా అయి పోయింది"

"ఇంటర్ కాలేజీ టోర్నమెంట్స్ ఎప్పట్నుంచి?" మైక్రో స్కోప్ క్రింద స్లైడ్ అమరుస్తున్న డిమాన్స్ట్రేటర్ అడిగాడు.

"ఇంకా తెలియలేదండీ....కాని ఈ సంవత్సరం ఇంటర్ కాలేజీ ఆర్ట్స్ కాంపిటీషన్స్ మనకాలేజీలో జరుగుతాయట."

"ఆర్ట్ కాంపిటీషన్‌లో మన ప్రభుకి ప్రయిజొస్తుంది." అన్నాడు లెక్చరర్.

"అతనికి పితార్‌తో కూడ టచ్ వుందంటగదా!" అన్నాడు. డిమాన్‌స్ట్రేటర్.

"కాన్వెంటు నుంచి వచ్చాడు గదా!"

"అతనొక అనాథ అటగదా!" ఎదురుగానున్న కుర్చీలో కూర్చుంటూ అడిగాడు డిమాన్ స్ట్రేటర్.

"ఆ విషయాలేం అంతగా తెలియవండీ—కావి అతని కోసం వచ్చేవారు ఎవరూ ఉండరు. కాకపోతే డబ్బుకి మాత్రం కొదవుండదు...."

"కనీసం గార్డియన్ అన్నా లేరా!" అప్పటివరకు శ్రోతగా మిగిలిపోయిన కవిత అడిగింది.

"అదొక మిస్టరీ!" సమాధానమిచ్చారు లెక్చరర్‌గారు.

అంతలో ఎవరో రావటంతో సంభాషణ మారిపోయింది.

"ఇంక నే వెళతానండీ." అంటూ బయటకు నడిచింది.

"ప్రభూ ఒక అనాథా!" అనుకుంటూ స్టెప్స్ దిగుతుండల్లా 'కీ' చైన్ త్రిప్పుతూ స్టెప్స్ ఎక్కుతున్న సంజీవ్ కనిపించటంతో ఆగింది.

"హల్లో. ప్రభూ లాబ్‌లో వున్నాడా!" అడిగాడు సంజీవ్.

"ఈ వేళ నాది బోటనీ లాబ్" అని "తమరీవేళ రాలేదెందుకనో!" అనడిగింది.

"అధికారంతో అడుగుతున్నారా!"

"అడిగితే!...."

"సవినయంగా విన్నవించుకుంటాం."

ఫక్కున నవ్వి, "భలే తమాషాగా మాట్లాడుతారండీ!" అన్నది.

"సరే, ఇంక నాకు శలవా!" అంటూ వెళ్ళిపోయాడు.

"అందుకే కాబోలు ప్రభు ఎప్పుడూ డల్‌గా వుంటాడు" అను

కుంటూ పరధ్యానంగా నడుస్తున్నదల్లా. "అందమైన అమ్మాయి ఆలోచనల్లో పరిసరాల్నే మర్చిపోయిందంటే దాని అర్థం...." ఎవరివో మాటలు వినిపించటంతో ఈ లోకంలోకొచ్చి వెనుదిరిగి చూపింది. పదిహేనేళ్ళ ప్రాయంలోనున్న కుర్రవాడొకడు ఏదో ఘనకార్యం చేసినవాడిలా స్థంభం దగ్గర నిల్చుని సిగరెట్ త్రాగుతూ నవ్వుతున్నాడు.

"ప్చ్....ఆరునెలలు కాలేదు కాలేజీలోకి అడుగుపెట్టి, అప్పుడే కాలరెత్తాడు. డిగ్రీ పుచ్చుకుంటాడో లేదో!" అనుకుంటూ క్యాంటీన్ వైపు నడిచింది.

క్యాంటీన్‌లోకి అడుగుపెట్టిన కవిత బ్రెడ్‌జామ్ తింటున్న పిచ్చికవిని చూపి, "ఖర్మరా బాబూ...." అనుకుంటూ క్యాంటీన్ నుంచి వెళ్ళిపోయే ప్రయత్నం చేసేంతలో అతను చూడటం, చూసి పిలవటం జరిగిపోయాయి. పెదవులపై నవ్వుని పులుముకుని "ఎన్నాళ్ళకి కవీశ్వరులు ఏకాంతంగా కనిపించారు." అంటూ ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంది.

"బోయ్. దో ప్లేట్ అవడా...."అంటూఆర్డరిచ్చి,"పాపులర్ ఫిగర్స్‌కి ప్రాబ్లమ్స్ ఎక్కువండీ....పట్టుమని పదినిమిషాలు ఏకాంతంగా ఉండే అవకాశం దొరకటంలేదు .... బయటకొస్తే చాలు అభిమానులు ఊపిరి సలపనివ్వరండీ" అన్నాడు.

"అవునవును. చూస్తూనే ఉన్నానుగదా....ఎప్పుడైనా ఖాళీగా ఒంటరిగా కనిపిస్తారేమోనని చూస్తాను. ఊహుం...."

"నిజమా....? మీ ఇల్లెక్కడో చెప్పండి....రోజూ మీ ఇంటికి వచ్చి కనిపిస్తాను."

"నో....నో....మీలాంటి ప్రతిభావంతుడ్ని నా చుట్టూ త్రిప్పుకుంటూ మీ అభిమానులకి ద్రోహం చేయలేను."

"అది కాదండీ...."

"నో... నో.... మీరు టైమ్ వేస్ట్ చేయకూడదు.... మీ కవితా స్రవంతిని వృధా చేయకూడదు" అని "తిరిగి ఏమైనా వ్రాశారా?...." కాఫీ కప్పు అందుకుంటూ అడిగింది.

"ఆఁ! వ్రాశాను ....చదివి మీ అభిప్రాయం చెప్పండి"

అంటూ కవరుతీసి ఆమె ముందుంచుతూ, "చాల అర్జంటు పనుంది. వస్తా" అంటూ, "బిల్ నేను చెల్లిస్తాను"అంటూ వడివడిగా అడుగు లేసుకుంటూ వెళ్ళిపోయాడు.

"ఏం మనిషిరా బాబూ!" అనుకుంటూ కవరు తీసింది. అందులో వున్నది కవితగాదు, ప్రేమలేఖ! చదవసాగింది-

"మైడియర్,

నా ప్రేమ సామ్రాజ్యానికి రాణివి నీవే! నా కవితా స్రవంతికి జీవానివి నీవే! నీ హృదయంలో నాకు సూది మొన మోపేంత చోటివ్వు. కళ్ళు తెరిచినా, మూసినా నా మదిలో మెదిలేది నీ రూపమే. నా జీవిత రథసారధ్యం వహించి నన్ను ముందుకు నడుపు. నీవు కాదంటే నేను బ్రతకలేను. నీ దయాభిక్ష నాకు ప్రసాదించు.

రేపు ఆదివారం రెండుగంటలకి అలంకార్ థియేటర్‌లో నీ కోసం ఎదురు చూస్తుంటాను.

నీవు కాదనవని ఆశిస్తూ....

— నీ ప్రేమభిక్ష కోసం తపించిపోతున్న

గణపతిశాస్త్రి."

లెటరు చదివి కవిత కళ్ళు జేవురించాయి. "స్టుపిడ్.... ఆడ పిల్ల కొద్దిగా చనువుగా మాట్లాడితే చాలు, 'ప్రేమ....ప్రేమ' అంటూ వెంట బడతారు. ఆ వేళ ప్రభువుమీద రిపోర్టు ఇవ్వమని సలహా చెప్పాడు. ఈ వేళ?"

"మైడియర్ అట.... డియర్" అని ఈసడించుకుంటున్న కవిత దృష్టిలో అప్పుడే క్యాంటీన్‌లోకి అడుగుపెట్టున్న రజనీ ప్రియ మెదిలింది. ఆమె మెదడు చురుగ్గా పని చేయటం ప్రారంభించింది.

"అబ్బ, ఈ కెమిస్ట్రీ ప్రాక్టికల్స్‌తో చచ్చిపోతున్నానే" అంటూ బుక్స్ టేబుల్‌మీదపెట్టి వాష్ బేసిన్ దగ్గరకు నడిచింది. అప్పటి వరకు కవిత చేతిలోనున్న లెటరు రజనీప్రియ పర్సులోకి మారి పోయింది.

# 5

ఆదివారం........

చీకటి గదిలో ఒంటరిగా కూర్చుని కళ్ళు మూసుకుని ఎక్కడో ఆలోచిస్తున్నవాడల్లా చల్లని చెయ్యి ఫాలభాగాన్ని తాకగా మెల్లగా కళ్ళు విప్పాడు ప్రభు.

"లైట్ వేయమంటారా" అంది కవిత.

"ముందు తలుపు తీయండి, ఎవరైనా చూస్తే బాగుండదు."

"అంతా సినిమాకెళ్ళారు" అంటూ లైట్ ఆన్ చేసింది.

తిరిగి కళ్ళుమూసుకుని మౌనంగా పడుకున్నాడు.

"జీవితంలో ప్రతివ్యక్తికీ జ్ఞాపకాలతో జీవించేకాలం వస్తుంది కాని ఆ రావటమనేది ఇంత చిన్నతనంలో మాత్రంకాదు" బెడ్ మీద కూర్చుంటూ అన్నది.

"ఆఁ!" అంటూ కళ్ళు తెరిచాడు.

ఎఱ్ఱని జీరలు వారిన ఆ కళ్ళవంకే చూస్తూ, "కష్టాలు కలిగితే సామాన్యులు కన్నీరు కారుస్తారు....కాని మహనీయులేమో ఆ కన్నీటినుంచి కుసుమాన్ని వికసింపజేసి లోకంపై వెదజల్లుతారు" అన్నది.

"మీరేం మాట్లాడుతున్నారో నా కర్థంగావటం లేదు!"

"తలుపులు బిగించుకొని చీకట్లో కూర్చుని, ఎక్కడో ఊహాలోకంలో తేలియాడుతున్న మీకు అర్థంగాకపోతే ఆశ్చర్య పడవలసిన పనిలేదు."

"నా మానాన నన్ను వదిలేయక, ఎందుకు నన్నిలా విసిగిస్తారు!"

"నేను మిమ్మల్ని విసిగిస్తున్నానా?"

"కాకపోతే మరేమిటి?"

"ప్రభూ! మిమ్మల్ని, మీ పితార్ని చూస్తుంటే-నాకు ఏమిటోగా అనిపిస్తుంది"

"పొరపాటు పడ్డావ్ కవితా! నిత్యజీవితంలో హృదయానికి పట్టిన ధూళిని తొలిగించేదే సంగీతం."

"కాని ఆ ప్రేళ్ళు మీటేది విషాద గాథలేగా!"

"విషాదమనే పాత్రలోకి చేర్చబడ్డ కన్నీటి నిలువ అమూల్యం"

"అమూల్యమనేది పాలుత్రాగే పాపాయి మొదలు కాటికికాళ్ళు చాచిన వృద్ధులవరకు అవగతం కావాలిగాని కేవలం విషాద హృదయాలకే పరిమితం కాకూడదు"

"అయసు ముక్క చేతిలో వేసుకుంటే అయిదు నిముషాలే ఉంటుందని తెలిసీ, అది శాశ్వతమని భ్రమ పడలేను."

"జీవితమంటే గుడ్డిగవ్వకాదు. గడ్డిపువ్వు అంతకన్నాకాదు వృధా చేయటానికి....అది భగవంతుడు తీర్చి దిద్దిన తైలవర్ణ చిత్రం. మన జీవితాలు బుద్బుద ప్రాయమని తెలిసినా ఎవరిత్రాణకు తగినట్లుగా వారు శ్రమించటం ముఖ్య కర్తవ్యం."

"చిత్రాన్ని మన ఇష్టమొచ్చిన రీతిలో చిత్రించుకోవచ్చు... కాని జీవితం అలాగాదే...." అన్నాడు ప్రభు.

"జీవితమంటే ఒక కంటకన్నీరు, రెండోకంట పన్నీరు ఉంటాయి. చీకటి కడుపున దాగుంటుంది, ఉషాసుందరి....సంధ్య కాంతుల సోయగాన్ని కప్పివేస్తుంది నిశీధి. చీకటి, వెలుగుల సమ్మేళనమే ఈ జీవితం. కన్నతల్లి పాలల్లో ఆ బిడ్డ జీవితం, ఆ దేశ చరిత్ర దాగుంటాయి." అంటున్న కవిత ఓ క్షణం ఆగి,

"ఏ దేశ చరిత్ర తిరగేసినా కనిపించేది పాలుగాదు. రక్తపు ధారలు! ఏ వ్యక్తి జీవితపు పుటల్ని తిరగేసినా ఇతరుల ప్రవేశ విస్ఫ్రక్రమణలే! ప్రతి కన్నతల్లీ ఆ బిడ్డ జీవితానికి పునాది వేస్తుంది. కాని ఆ వ్యక్తిని ముందుకు నడిపించేది మరో వివేకవంతురాలయిన స్త్రీ సహచర్యమే!"

"........."

"జీవితమనేది ఒక క్రొత్తకుండ. అందులో పాలుపోస్తే పాలకుండ అవుతుంది, కల్లుపోస్తే కల్లుకుండవుతుంది. అది

గుర్తించుకో. నీవొక ఆర్టిస్టువి, విద్యావంతుడివి. నీ టాలెంట్ ని వేస్టు చేసుకోకు" అంది కవిత.

"నేనందుకళ క్తుడ్ని కవితా!"

"వీణ అంతటి వాయిద్యం కూడా వెదురు బొంగునుండి వచ్చిందే."

"........."

"ఇంకా ఏమిటి ఆలోచిస్తున్నారు? చీకట్లో కూర్చుని రిక్త హస్తాలతో శూన్యపు తెరల్ని చీల్చుతూ కూర్చునేకంటే వెలుగులోకి చూసి ఒక్కసారి వాస్తవాన్ని గుర్తించండి."

"కవితా!" అంటూ కళ్ళుమూసుకొని, "నేను చాల అల్పుణ్ణి" అన్నాడు.

"మీ ప్రక్క నేనున్నాను.... లేవండి" అంటూ చెయ్యి అందించింది.

"ఎక్కడికి?"

"వెలుగులోకి"

"అంటే వరండాలోకా!" నవ్వుతూ అన్నాడు. శృతి కలిపింది.

సరిగ్గా అదె సమయంలో....

బట్టతల కనిపించకుండా ముందుకు దువ్విన జుట్టుతో, పిల్లికళ్ళు కనిపించకుండా నల్లకళ్ళద్దాలు పెట్టుకొని, టినోపాల్ ఏజెంటులా థియేటర్ దగ్గర రెండు సినిమా టిక్కట్లు చేతబట్టుకుని నిల్చును న్నాడు పిచ్చికవి గణపతిశాస్త్రి. అంతలో రిక్షా ఒకటివచ్చి హాలు ముందాగింది. అతడూహించినట్లుగా అందులో నుంచి దిగింది కవిత కాదు, నల్లగా పీలగా వున్న రజనీ ప్రియ.

"అయ్య బాబోయ్...ఈవిడ తగలడిందేమిటి?" అనుకొని చూడనట్లుగా ప్రక్కకు తిరిగి నిల్చున్నాడు. రిక్షా డబ్బు లిచ్చేసి, "హమ్మయ్య...ఇక్కడే వున్నాడు" అనుకుంటూ గుండెలనిండా గాలి పీల్చుకుని మెల్లగా దగ్గరకొచ్చింది. కాని కవి మాత్రం ఆమెను చూసే ప్రయత్నమేమీ చేయకపోవటంతో 'నల్లకళ్ళజోడు పెట్టుకున్నాడు... చూసి ఉండడు.' అనుకుంటూ తన ఉనికిని తెలియజేస్తూ మెల్లగా దగ్గింది రజనీప్రియ.

"శ్రీరామచంద్రా! రామేశ్వరం పోయినా శనీశ్వరం పోలేదని థియేటర్ కొచ్చినా ఏకాంతం దొరికేలా లేదు." అనుకుని చూడనట్లే నటించ సాగాడు.

"శాస్త్రీ!..." పిలిచిందామె.

"ఖర్మరాబాబూ!" అనుకుంటూ అప్పుడే చూసినట్లుగా ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ "హల్లో...ఎప్పుడొచ్చారు?" అనడిగాడు.

"ఇప్పుడే వచ్చాను...టికెట్లు తీసుకున్నావా?" అనడిగింది.

'అయ్యో! ఖర్మ. తనువస్తాననదుగదా.' అనుకుంటూ "తీసుకున్నాను" అని నీరసంగా జవాబిచ్చాడు.

"త్వరగా లోపలికెళదాం...రా!"

"ఎక్కడికి....?" రోడ్డువంక పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"వెధవ జోకులూ, మీరూ...సమయం సందర్భం ఉండక్కర్లా?" అని "ముందొక టిక్కెట్టివ్వండి" అన్నది.

తెరిచిన నోరు మూయటమే మర్చిపోయి అప్రయత్నంగా టిక్కెట్టు ఆమె చేతిలో పెట్టాడు.

"ఎవరైనా చూస్తే బాగుండదు....ముందు నేవెళతాను.... త్వరగారండి."

ఆమె చెప్పిందేమిటో అర్థంగాక క్వశ్చన్ మార్క్ ముఖం పెట్టి చూడసాగాడు. కాని అతడాశ్చర్యాన్నుంచి తేరుకోక పూర్వమే ఆమె తుర్రుమంది.

క్షణాలు నిమిషాల్లా దొర్లిపోసాగాయి. కవిత వస్తుందేమో, ఈమెను చూసి ఏమనుకుంటుందోనని బితుక్కు బితుక్కుమంటూ నిల్చుండిపోయాడు. పిక్చర్ ప్రారంభమై పావుగంటయినా కవిత జాడలేకపోవటంతో 'బ్రతుకుజీవుడా' అంటూ హాలులోకి అడుగుపెట్టి బోయ్ చూపెట్టిన సీట్లో రజనీ ప్రియ ప్రక్కనే కూర్చున్నాడు.

"డియర్!" అంటూ తలని అతని భుజానికి జేర్చింది రజనీ ప్రియ.

దోరవయసులో నున్న ఆడపిల్ల హఠాత్తుగా 'డియర్' అంటూ తలని భుజానికి జేర్చి ఒత్తిగిలి పడుకునేసరికి ఏం చేయాలో తెలియక గుడ్లు తేలేశాడు. చలిజ్వరం వచ్చిన వాడిలా వణికిపోయాడు.

"మాకు కనిపించటంలేదు. కొద్దిగా జరిగి కూర్చుంటారా?" వెనుక నున్నవారు హెచ్చరించటంతో. "రజనీ. సరిగ్గా కూర్చో!" అన్నాడు.

"ఛీ! ఇంత ధైర్యం లేనివాడివి లెటరెందుకు వ్రాశావ్?" సరిగ్గా కూర్చుంటూ అన్నది.

"నేనా?" అని అంతలో ఏదో స్ఫురణకొచ్చి "నీకా?" అన్నాడు.

"నీవు రచయితవేకాదు.... పెద్దనటుడివికూడ" అంటూ బ్యాగ్‌లోని లెటరు తీసి పిచ్చికవి చేతిలో పెట్టింది.

ఆ లెటరు చూసి కళ్ళు తిరిగి ముందుకు పడబోయి అంతలో తమాయించుకుని కుర్చీకి ఆనుకుని రజనీప్రియ భుజం పట్టుకుని కూర్చుంటపోయాడు పిచ్చికవి ఉరఫ్ గణపతి శాస్త్రి.

* * *

జనరల్ లైబ్రరీలో పేపరుచూస్తూ కూర్చునున్నది కవిత. అంతలో 'గుడ్‌మార్నింగ్' అంటూ వచ్చాడు పిచ్చికవి.

"ఫైన్ మార్నింగ్." లోస్వరంతో అన్నది.

"మీరు ఎడిటోరియల్స్ చదువుతారా?" తిరిగి అడిగాడు.

ఇబ్బందిగా లైబ్రేరియన్ వైపు చూపింది. తిరిగి పిచ్చికవి వైపు తిరిగి 'లేదు' అన్నట్లుగా తలూపింది.

"దట్స్‌గుడ్.... ఎడిటోరియల్స్‌లో ఏముంది? ఆ ఎడిటర్స్ పర్సనల్ ఓపీనియన్స్ తప్ప... ఆ మాత్రం మనమూ వ్రాయలేమా?"

అంతలో "సైలెన్స్ ప్లీజ్" అని కేకవేశాడు లైబ్రేరియన్.

"పేపరు తెరవగానే మీరు ముందు చూసేదేమిటి?"

"ప్లీజ్.... ఇప్పుడు మాట్లాడకండి."

"ఏదో వాడేదో అన్నాడని మీరు అంటున్నారా?.... వాడన్నది మనల్నికాదండీ!"

"సైలెన్స్‌ప్లీజ్." తిరిగి హెచ్చరించాడు లైబ్రేరియన్.

"ఏమోయ్, నేనెవరో తెలుసా?"

"అదంతా నా కనవసరం.... ఇది లైబ్రరీ అన్న సంగతి మర్చిపోకండి"

"షటప్...."

"వాట్!" అంటూ లేచాడు లైబ్రేరియన్.

"సారీ సార్!" అంటూ లేచి "టైమయింది క్లాసుకెళ్దాం పద" అంది కవిత.

పిల్లిలా ఫాలో అయ్యాడు పిచ్చికవి.

"మీరుండబట్టి బ్రతికిపోయాడుగాని లేకపోతే వాడి అంతు చూసే వాడ్ని."

వరండాలోకి అడుగుపెడ్తూ అన్నాడు.

పెల్లుబుకుతున్న నవ్వుని పెదవుల చాటునే దాచుకుంది.

"వాడి స్టేటస్ ఏమిటి.... మన స్టేటస్ఏమిటి" చేత్తో క్రాఫు సరిజేసుకుంటూ అన్నాడు.

"అబ్బా! మీ క్రాఫ్ దేవానంద్ క్రాఫులా చాల బాగుంటుందండీ." అతడ్ని క్రీగంటచూస్తూ అన్నది.

"క్రాఫా.... అసలు మా తలకట్టే అంత. మా తాత జుట్టులో సోలెడు నువ్వులుపోస్తే గింజకూడ దిగేదికాదట" అని "ఏమిటంత డల్‌గా ఉన్నారు?" అనడిగాడు.

"రాత్రి నిద్రపట్టలేదండి."

"నిద్ర పట్టక పోవటానికి కారణమేమిటి?"

"అబ్బే ఏమీ లేదండి."

"కాదు ఏదో ఉంది!"

"నో—నో...."

"ఉహుఁ! నా దగ్గరేదో దాస్తున్నారు" కొంటెగా చూస్తూ అన్నాడు.

"చెప్పాల్సిందేనా?" మురిపెంగా అడిగింది.

"తప్పకుండా"

"మంచం నిండా నల్లులేనండీ"

"అంతేనా!" బెజ్జం పడిన గాలి బుడగలా నిరుత్సాహంగా అన్నాడు. అంతలో ఏదో గుర్తుకొచ్చిన వాడిలా, "మర్చేపోయాను.... మొన్న మీ కిచ్చింది ఏంచేశారు?" కుతూహలంగా అడిగాడు.

"ఓ! కవితేగా? రజనీప్రియ చదువుతానంటే ఇచ్చాను.... ఏమన్నా అన్నదా?"

"అబ్బే....ఏం లేదు" కంగారుగా అన్నాడు. అంతలో సంజీవ్ కారు రావటంతో, "జస్ట్ ఏ మినిట్" అంటూ కారు వైపు నడిచాడు పిచ్చికవి.

ఎప్పట్నుంచి ఆబ్జర్వ్ చేస్తుందో ఏమో గాని అతడటు వెళ్ళ గానే "ఏమే కవితా!" అంటూ వచ్చింది రజనీ ప్రియ.

"ఈ వేళ ప్రాక్టికల్సా? థీరియా?" అనడిగింది కవిత.

"ప్రాక్టికల్స్ గాని....ఏమిటీ? గణపతిశాస్త్రి చెపుతున్నాడు."

"అమ్మ దొంగా....నీవు చెప్పకుంటే నాకు తెలియదనుకు న్నావటే, మొత్తానికి గ్రంథాన్ని నడుపుతున్నావు" బుగ్గ పట్టుకొని ఊపుతూ అంది.

"ఖర్మ.... లెటరయితే వ్రాసాడు గాని 'నన్ను ముట్టకే నా మాల కాకి' అన్నట్లుగా అంటీ ముట్టనట్లుంటాడేమిటి?"

"కొంతమంది అంతేలేవే.... ఈ తఫా నీకెందుకు నీవే స్ప్రింగ్ లెటర్ వ్రాసి పడెయ్."

"ఫలిత ముంటుందటావా?" బేలగా అడిగింది రజనీప్రియ.

"నా మాటంటే మాటే"

"ఏమిటీ అంత భరోసాగా చెప్తున్నావు. ఎంత ఎక్స్‌పీరి యన్స్ ఉందేమిటి?"

"అమ్మ దొంగా! నన్నే దెబ్బ కొట్టావే!" అంటూ మొట్టికాయ వేసింది కవిత.

అంతలో బెల్ మ్రోగటంతో ఎవరివారి వారు పట్టక తప్పలేదు.

# 6

సాయం సంధ్య. ఏ యువ చిత్రకారుడో కలగా పులగంగా రంగులు పులిమినట్లుంది ఆకాశం. సూర్యుడు పడమటి కనుమల్లో

తలదాచు కుంటున్నాడు. కుంచె పట్టుకుని ఫైనల్ టచప్ చేస్తున్న వాడల్లా ఆ తల్లి రొమ్ము దగ్గర ఆగిపోయాడు. పాలు త్రాగుతున్న పసివాడ్ని చూసి పరవశించి పోతున్న మాతృమూర్తి చిత్రమది. ఆ పసివాడి నోటినుంచి పాలు పక్కగా జాలు వారుతున్నాయి. జాలు వారుతున్న ఆ పాలని చూడగానే ఆ చిత్రకారుని కళ్ళనుండి జర జర కన్నీరు కారింది. విస్సహాయంగా చేతిలోని కుంచెల్ని ట్రేలో పడేసి పడక్కుర్చీలో వాలిపోయి బాధగా కళ్ళు మూసుకున్నాడు.

"అమ్మా! సృష్టిలో అతి తియ్యనిది కన్న హృదయమంటారు. రక్తమాంసాల్ని పంచి ఒకరూపాన్నిచ్చి, నవమాసాలు మోసి, మృత్యువుతో పోరాడి సృష్టికి ప్రతిసృష్టి చేయగల కళాతపస్వి ఆ కన్నతల్లి అంటారు. ఒక్కసారి 'బాబూ' అంటూ నన్ను నీ హృదయానికి హత్తుకోమ్మా...." అంటూ మూగగా రోదించిందా కళా హృదయం. అలా ఎంతసేపున్నాడో గాని "మే ఐ కమిన్?" అన్న మాటలు వినరావటంతో కళ్ళు తెరవక తప్పలేదు. ఎదురుగా తెల్లని చీరలో ముద్దమల్లెలా కవిత కన్పడింది.

అప్పుడే ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూసి వికసించీ వికసించ కుండా వున్న కలువలా, నవ్వీ నవ్వకుండా, "లోపలికి రావచ్చా?" అనడిగింది.

అప్పుడు గాని వాస్తవానికి రాలేదుప్రభు. "రా కవితా!" అంటూ సర్దుక్కూర్చున్నాడు.

"వాట్ ఎ ఫైన్ ఆర్ట్!" లోపలికి అడుగు పెడ్తూ అంది.

"అదొక ఎండమావి" నిట్టూరుస్తూ అన్నాడు.

"అడిగో మళ్ళీ...." అంటూ చిరుకోపం ప్రదర్శించింది.

"నా బాధ నీ కర్థంగాదు కవితా!"

"నీకూ బాధలా?"

"హుఁ! నాకు....బాధలు" అని పేలవంగా నవ్వి "ఆ కుంచెలు నేను చెప్పినట్లల్లా నడుస్తాయి.... ఏ దృశ్యానికయినా రూపకల్పన చేసి ప్రాణం పోసే శక్తి నా చేతి కుంది....కాని....కాని నా 'అమ్మ' ఇలాగుంటుంది అని చెప్పుకోలేని నిర్భాగ్యుడ్ని కవితా!" అంటూ రెండు చేతుల్లోనూ ముఖాన్ని దాచుకున్నాడు.

"ప్రభూ!'' అంటూ లాలనగా తన రెండు చేతుల్లోకి అతని ముఖాన్ని తీసుకొని "ప్లీజ్! ఒకసారి నా వంక చూడు.''అభ్యర్థించింది.

అతి భారంగా కనురెప్పలెత్తాడు.

"ఛీ! ఏమిటి చిన్న పిల్లవాడిలా ఏడుస్తున్నావ్!'' చూపుడు వ్రేలితో కన్నీరు తుడుస్తూ అంది.

"లేదు కవితా! ఒక్కసారి నోరారా 'అమ్మా!' అని పిలవాలని వుంది. ఆ కన్న ఒడిలో తలనిడుకొని నన్ను నేనే మర్చిపోవాల నుంది."

"ప్రభూ!" అంటూ అక్కున జేర్చుకుంటూ, "ప్రతివ్యక్తి జీవి తమనే డైరీలో ఏదో వ్రాయాలనుకుని ఏవో వ్రాసి, వ్రాయలేక పోయిన దాన్ని గుర్తు చేసుకుంటూ బాధపడటం సహజం....

"ప్రతి కన్న తల్లీ తన బిడ్డని చాలా ఉన్నతంగా ఊహించు కుంటుంది. ఆ ఆశలతోనే మృత్యువుతో కొట్టు మిట్టాడుతూ బిడ్డను కంటుంది... కాని ఆ మృత్యువు కోరల్లోంచి తప్పించుకోలేక పోవచ్చు. అప్పుడాబిడ్డ తన శక్తియుక్తుల్ని ధారపోసి ఆ తల్లి కలల్ని కార్య రూపాన పెట్టిన నాడే తాను అనుభవించిన ప్రసవ వేదనకి ఫలితం దక్కుతుంది. లేకుంటే ప్చ్...." అంటూ పెదవి విరిచింది.

కాని ప్రభు మాత్రం ఉలకనూ లేదు, పలకనూ లేదు.

"ప్రభూ....!" పిలిచిందామె.

"ఊఁ!"

"లే!"

"ప్లీజ్ డిస్టర్బ్ చేయకు.... నా కిప్పుడెంతో ధైర్యంగా సుఖంగా వుంది.'' కళ్ళు తెరవకుండా అన్నాడు.

"సుఖం అన్నది రెండు చక్రాల బండి. ఒకటి మనసు చైతన్యవంతం కావాలి. రెండు శారీరకమైన అనుభవం కావాలి. ఆ రెండూ కలిసినప్పుడే సుఖం లభిస్తుంది."

కాని అతడు మాత్రం ప్రత్యుత్తర మివ్వలేదు. అలాగే ఆమె ఎదపై తల పెట్టుకొని నిద్రలోకి జారిపోయాడు.



# 7

క్రాలేజీ అవర్స్ ప్రారంభానికి ముందు, నిండు చూలాలిలా ఆవరణంతా స్టూడెంట్స్‌తో నిండిపోయింది. చెట్లక్రింద కూర్చుని బాతాఖానీ కొట్టేది కొందరైతే, క్యాంటీన్ వెనుక సిగరెట్స్ త్రాగేది మరికొందరైతే, లైబ్రరీ పుస్తకాల్ని తినేసేది మరికొందరు. లైబ్రరీ లోకి వెళ్ళబోతున్న వాడల్లా సంజీవ్ కారు కనిపించటంతో ఆగాడు ప్రభు. కారు ఆపి, "ఎక్కు" అన్నాడు సంజీవ్.

"పార్క్ చేసిరా.... నేనీలోపు బుక్స్ రిటర్న్ చేసివస్తా."

"ఓ. కె." అంటూ ముందుకు దూసుకుపోయాడు.

మరో అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు ప్రభు.

"రాత్రి నిద్రపోలేదా?" పరిశీలనగా చూస్తూ అడిగాడు సంజీవ్.

"ఆఁ.... అబ్బే... ఏది....?"

"ఏమిటా కంగారు?" నవ్వాడు.

మాటలే కరువయినట్లుగా నడవసాగారు.

నడుస్తున్న వాడల్లా, "ప్రభూ! నిద్రలేమితో ముఖం వాడి పోయినా, కళ్ళల్లో ఏదో కాంతి. డ్రస్‌లో ప్రత్యేకత కన్పిస్తున్నాయి." హఠాత్తుగా అన్నాడు సంజీవ్. ప్రభు ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ మౌనంగా లాబ్ వైపు దారితీశారు.

"బాబూ ఈవేళ ప్రాక్టికల్స్ కాన్సిల్ అయ్యాయి" బ్యూరెట్స్ క్లీన్‌చేస్తున్న అటెండర్ చెప్పాడు.

"ఎందుకని?"అన్నాడు సంజీవ్.

"పవర్ సప్లై లేదండీ....ఆర్గానిక్ ఎనాలిసిస్ కదా!"

"ఓ. కె." అంటూ వెనుదిరిగాడు సంజీవ్.

"ఈ వేళ ఫ్రీ అన్నమాట!" మెట్లుదిగుతూ అన్నాడు ప్రభు.

"ఆఁ! కాని నీకివేళ చేతి నిండా పని."

"అదేం?"

"సీతారామ లక్ష్మణుల చిత్రమొకటి కావాలి."

"అదేమిటి ధ్యాసటు మళ్ళింది?"

"లేదు ప్రభూ..నా అంతరంగాల్లో పేరుకుపోయిన భావనఅది."

"దట్సాల్ రైట్" అని "సాయంకాలం రా! కలర్స్ అయిపోయాయి.అదీగాక కొద్దిగా బ్యాంక్‌కి వెళ్ళిరావాలి" అన్నాడు ప్రభు.

"ఎంత డ్రా చెయ్యాలి?"

"ఫైవ్ హండ్రెడ్స్" అన్నాడు.

"సరే....ఈవినింగ్ ఎగ్జాట్‌లీ ఫైవ్ కొస్తాను." అంటూ కారువైపు నడిచాడు.

"కలర్స్ మర్చిపోకు." హెచ్చరించాడు.

"అలాగే" అన్నట్లుగా చెయ్యూపి స్టార్ట్ చేశాడు.

కారు పాతిక గజాలు వెళ్ళిందో లేదో కవిత కన్పించటంతో సడన్ బ్రేక్ వేయక తప్పలేదు సంజీవ్‌కు.

తలబయటకు పెట్టి, "ప్రాక్టికల్స్ క్యాన్సిల్ అయ్యాయట.." అన్నాడు సంజీవ్.

"ఇప్పుడే తెలిసింది....ఏం? వెళ్ళిపోతున్నారే?"

"పనుంది" అంటూ "ప్రభుని చాలా మార్చారే! థాంక్స్" అన్నాడు.

"సంజీవ్! మనం చేసే ప్రతిపని వెనుక ఆత్మీయత, సానుభూతి ఉంటాయి."

"ఈజిట్!" అంటూ కళ్ళజోడు తీసి ఆమె కళ్ళల్లోకి కొంటెగా నవ్వుతూ చూశాడు.

"సంజీవ్! ఒకనాడు నీవు చెప్పగా ప్రభుని పరిచయం చేసుకునుండవచ్చు. కాని ఈనాడు ప్రభూ నీకేగాదు, నాకూ స్నేహితుడే."

"థాంక్యూ కవితా! ప్రభు నాకు స్నేహితుడేగాదు. తోబుట్టువులు లేని నాకు అన్న....చైతన్యరహితమైన జీవితాన్ని గడిపేవాడి జీవితంలో చైతన్యం కలిగితే నాకు అదే పదివేలు."

"ఈ విషయంలో నన్ను పరాయిదాన్ని చేయకండి." అని ఆమె అనగానే ఆ తేనె కళ్ళల్లో కాంతి పుంజములు వెల్లివిరిశాయి.

తృప్తిగా చూస్తూ. "వెళతాను కవితా." అంటూ గేర్‌మీద చెయ్యేశాడు. సంజీవ్

"మంచి!" అంటూ ముందుకు నడిచింది. అలా వెళ్ళటం వెళ్ళటం తిన్నగా ప్రభు గదికి వెళ్ళింది.

తెల్లని పైజామా లాల్చీ వేసుకొని తనలో తానే నవ్వుకుంటూ పరిసరాల్నీ మర్చిపోయిన ప్రభుని చూసి. డోర్ దగ్గరే నిల్చుండి పోయింది. అడుగుల సవ్వడికి తలెత్తిన ప్రభు. గులాబీ రంగు చీర కట్టుకుని. పసిడి మేను ఛాయతో. అపరంజి బొమ్మలాగా ఉన్న ఆమెను చూస్తూ రెప్ప వేయటమే మర్చిపోయాడు. మెల్లగా తన వునికిని తెలియజేస్తూ చిన్నగా దగ్గింది. హఠాత్తుగా మేల్కొన్న వాడిలా వాస్తవాని కొచ్చి, "రా .... రా కవితా!" అన్నాడు. చిన్నగా నవ్వుతూ దగ్గరకొచ్చి. "ఆలోచనల్లోపడి మీలో మీరే నవ్వు కుంటున్నారేమిటి?" అనడిగింది.

"కాంతులు వ్యాపించినపుడు కత్తులు సైతం ఆలోచిస్తాయట.... జిహ్వా రుచెరిగిన నేను ఆలోచించటంలో ఏముంది?"

ఫక్కున నవ్వింది. ఆ నవ్వులో ఎగిసిపడే వక్షోజాల్ని వంకే చూస్తుండి పోయాడు. ఆతనిదృష్టి ఎక్కడ నిలిచిందో చూసిన కవిత సిగ్గు మొగ్గై జారిన పవిటను సరిచేసుకుంది.

"రూప లావణ్యాలకు సంబంధించిన సొత్తు యావత్తు స్త్రీకి సొంతం కావటం సృష్టి లీల" అన్నాడు ప్రభు. తృటి కాలంపాటు అతడ్ని చూసి వెంటనే తల దించేసుకుంది. కాని "కవితా!" అన్న పిలుపు వినిపించినా తలెత్తలేక. "ఊ" అన్నది.

"ఇటు చూడు" అనగానే తలెత్తక తప్పలేదు. అతని చేతిలోనున్న చిత్తరువుని చూడగానే ఆమె హృదయం రెప రెపలాడింది.

"ఇదెప్పుడు వేశారు?"

"రాత్రి"

"ఆఖరికి నాగడ్డం మీదున్న మచ్చ కూడా ప్రజంట్ చేశారు.... అంత బాగా గుర్తు పెట్టు కున్నారే!"

"మనస్సు మీద పడ్డ గీతలు అంత త్వరగా చెరిగిపోవు"

'నీరెప్పల విల్లువిరిగినప్పుడల్లా నా గుండెల్లో గాయాలు రేగుతున్నాయి.' చిత్రం క్రిందనున్న వాక్యాలు చదివి, "ఎవరివి?" అనడిగింది.

"నీవే"

సితార్‌ని మీటుతూ, "మీకు సంగీతమే కాదు. కవిత్వంకూడ వచ్చే!" అంది.

"సంగీతానికి సాహిత్యానికి అవినాభావ సంబంధముంది. రాగాలన్నీ శృంగార నాయకులు, రాగిణులన్నీ శృంగార నాయికలు. వారి స్వరూప స్వభావాల్ని శ్లోకాల్లో వర్ణించారు. ఆయా రాగరాగిణులను గానం చేసేటప్పుడు గాయకులు ఆ శ్లోకాలలో వర్ణించిన దృశ్యాలను భావన చేస్తుంటారు. దురదృష్టవశాత్తు ఆ సాంప్రదాయం మరుగున పడిపోయింది. లేకుంటే సంగీతం శైలి బాగుండేది."

"బాగుంది....మీ దగ్గర కూర్చుంటే ఇలాగే గడిచిపోయేలా గుంది." అంటూ లేచింది.

"అప్పుడే వెళ్ళిపోతున్నారా?" బిక్కమొహం వేసి అడిగాడు.

"రేపొస్తాగా!" అంటూ బయటకు నడిచింది.

ఆమె వెనుకనే వెళ్ళినవాడల్లా గుమ్మందగ్గరే ఆగి, ఆమె వెళుతున్న వైపు చూస్తుండి పోయాడు. పదడుగులు వేసిన ఆమె వెనుదిరిగి చూసింది. ఇద్దరిచూపులు కలుసుకున్నాయి. అతని హృదయంలో వెయ్యి వసంతాలు వెల్లివిరిసాయి. ఆమె చూపుల తూపులు అతని మదిలో నాటుకుపోయాయి. ఆమె వెనుదిరిగి వచ్చి, "పర్సు మర్చిపోయాను" అంది.

"మర్చిపోయింది కేవలం పర్సేనా?" అని, "రండి" అంటూ ఓరగా వేసున్న తలుపు తెరిచాడు.

"ఈ తలుపులు తెరిచి గదిలోకి రమ్మనటం గాదు. హృదయపు తలుపులు తెరిచి మీ జీవితంలోకి ఆహ్వానించగలరా?"

"కవితా..." అంటూ చేతులు సాచాడు.

"ప్రభూ...."అంటూ వెళ్ళి గువ్వలా అతని కౌగిట్లో ఒదిగిపోయింది. విసురుగా వీచిన గాలి కెరటమొకటి తలుపుని చేర వేసింది. బిగి కౌగిలిలో బంధీలై పోయారు.

"ప్రభూ..." తన్మయత్వంలో మునిగిపోతూ అన్నది.

"కవితా.... విన్ను పువ్వుల్లోపెట్టి పూజించలేనేమోగాని, విన్నాక పువ్వులా చూసుకోగలను."

"ఈ జన్మకి నా కంతేచాలు" అంటూ మరింత చేరువయింది. చివరకు గాలి చొరరానంతగా దగ్గరై పోయారు.

సరిగ్గా అదే సమయంలో....

"ఇన్సల్ట్.... తీరని అవమానం!" తోకతెగిన కోతిలా గదిలో అటు ఇటు పచార్లుచేస్తూ పదోసారి అరిచాడు పిచ్చికవి.

"ఏమిట్రా గొడవ?" లుంగీ ఎగదోపుకుంటూ వచ్చాడు నాగరాజు.

"మన కవిగాడికి రజనీప్రియ లవ్ లెటర్ వ్రాసింది." పెద్దబ్బాయి నవ్వుతూ అన్నాడు.

"ఒరే పెద్దబ్బాయ్....నీఅంత మొద్దబ్బాయ్ మరొకడుండడ్రా. లవ్ లెటర్ వస్తే ఏడ్చేవాడు, అందునా నలుగుర్ని పోగుచేసి మరీ ఏడ్చే వెధవెవడ్రా?"

"నా మాట అబద్ధమనుకుంటే ఈ లెటర్ చూడు!" అంటూ టేబుల్ మీదున్న లెటరిచ్చాడు.

లెటరంతా చదివి." నక్కని త్రొక్కావురా కవి!'' అంటూ కిసుక్కున నవ్వాడు నాగరాజు.

"నాగరాజు!....నీవూ ఆ చప్పిడి ముక్కు, పీపురుకళ్ళు, ముక్క పుడగు రజనీప్రియనే సపోర్టు చేస్తున్నావా?" ఉడుకుమోత్తనంతో అడిగాడు పిచ్చికవి.

"కవీ! నీ కసలు తలకాయలేదురా....లవ్ లెటర్ వ్రాసింది ఎవరో ఒక అమ్మాయి. రూపం అనవసరం.''

"....ఇహపోతే ఆ అమ్మాయి నిన్ను లవ్ చేసింది అంటే అందుక్కారణం నీ కవిత్వమే కదూ! అవునా?"

''అవుననుకో.''

"నీ కవిత్వం తారాస్థాయికి చేరుకుందనుకో. ఆనాడు రజనీ ప్రియ లాంటి వారు కాదు కవితలాంటి వారు కూడ. నీ ప్రేమకోసం క్యూలో విలబడాల్సిందే. ఏమంటావు?"

"అదీ పాయింటు."

"అందుకని నాదో సలహా" అని, "మీరంతా వెళ్ళిపోండిరా" అంటూ అందర్ని పంపించేశాడు నాగరాజు.

"చెప్పుగురూ!" అంటూ ముందుకు వంగాడు పిచ్చికవి.

ఈ రోజుల్లో కాగితాన్ని కరాబు చేయటానికి, కవిఅన్నవాడి కలానికి, చాలినంత మేత తేలిగ్గా దొరికేది ఎక్కడనుకున్నావ్?"

"తెలియదు గురూ!"

"వేశ్యలదగ్గర...అందువల్ల వేశ్యలమీద కవితలువ్రాసెయ్!"

"నాకు వాళ్ళగురించి తెలియదే...."

"తెలుసుకోవాలంటే అదంతకష్టంగాదు."

"ఎలా?" ఆశగా చూస్తూ అడిగాడు.

"వేశ్య దగ్గరకెళ్ళు"

"అమ్మబాబోయ్....నేను వేశ్యదగ్గరికే....నా కవితకి ద్రోహం చెయ్యలేను గురూ!"

"వేశ్య దగ్గరికెళ్ళినంతమాత్రాన కవితకి ద్రోహం చేసిన వాడి వెలా అవుతావ్?"

"నా ఏకపత్నీ వ్రతం భంగమైపోతుంది"

"వేశ్య దగ్గరకెళ్ళినంత మాత్రాన సంభోగించమని ఎవరు చెప్పారు?"

"మరి...." తెల్లమొహం వేసుకుని అడిగాడు.

"ఆమె దగ్గరకెళ్ళి ఆమె పుట్టుపూర్వోత్తరాలు, కష్టసుఖాలు తెలుసుకో."

"ఆమె ఒప్పుకుంటుందా?"

"డబ్బిచ్చి శరీరాన్ని తాకనంటే ఏ వేశ్య అంగీకరించదు!"

"కాని నాకు...."

"భయం. అవునా?"

"అవుననుకో....కాని నీవు తోడొస్తానంటే...."

"నేనా!" అని కొద్ది క్షణలాగి, "రావటం నాకిష్టంలేదు.... కాని ఒక స్నేహితుడిగా నీ పురోభివృద్ధి కాంక్షించటం నా ధర్మం." అన్నాడు.

"థాంక్యూ గురూ!....త్వరగా డ్రెస్ చేసుకో వెళ్దాం''

"అలాగే" అంటూ వెళ్ళిపోయాడు నాగరాజు.

ఎలాగైతేనే మరో పావుగంటలో పుస్తకం చేతపట్టుకొని నాగరాజు వెంట బయల్దేరాడు పిచ్చికవి.

చిట్టచివరకు వేశ్యానివాస స్థలికి చేరుకున్నారు.

"గురూ! ఇవన్నీ కొంపలే....అదిగో ఇంటింటా దిష్టిబొమ్మల్లా నిల్చున్న వాళ్ళంతా ఆ బాపతే, చేతిలో రెండ్రూపాయలు పెడితే నీ పని నిర్విఘ్నంగా నెరవేరుతుంది." అన్నాడు నాగరాజు.

"నా గుండె లెందుకో దడదడ లాడ్తున్నాయి!"

"మరేం పర్వాలేదు. 'ఆంజనేయా....ఆంజనేయా' అని మనస్సులో అనుకుంటూ వెళ్ళిపో." అని "ఏది ఒక పదిరూపాయిలివ్వు" అంటూ చెయ్యి సాచాడు నాగరాజు.

'ఎందుకు' అనబోయి, అంతలో భయమేసి కిక్కురుమనకుండా పదిరూపాయల నోటు చేతిలో పెట్టాడు పిచ్చికవి.

"ఓ. కె....నేను సినిమా చూసొస్తాను, నీవీలోపు పని పూర్తి చేసుకురా!" అంటూ ప్రక్కనే ఉన్న సినిమాహాలువైపు నడిచాడు నాగరాజు.

ధైర్యాన్నంతా కూడగట్టుకుని నాలుగడుగులు ముందుకేశాడు. పూరిపాక ముందు నిల్చునున్న స్త్రీ వైపు వెళ్ళబోయి అంతలో ఏమని పలకరించాలో తెలియక తచ్చట్లాడసాగాడు.

"రా....రా...." అంటూ నవ్వుతూ పిల్చిందామె,

అప్పటివరకు 'లబ్-డబ్' మని కొట్టుకుంటున్న గుండె ఒక్కసారి ఆగినట్లయింది. అంతలో ఆమె ముందుకొచ్చి. "రమ్మంటుంటే" అంటూ రెండు చేతులూ పట్టుకుని లాక్కెళ్ళినంత పనిచేసింది. గజగజ వణుకుతున్న కాళ్ళని అతి బలవంతాన కదుల్చుకుంటూ ఆమె వెంట పూరిపాకలోకి నడిచాడు.

"కూర్చోండి" అంటూ నుక్కిమంచంమీద పిచ్చికవిని కూలదోసి తదికెను దగ్గరకేసివచ్చి ప్రక్కనే కూర్చుంది. ఒరుగ్గా వెయ్యి ఓల్టుల కాంతిలోకి వచ్చిన త్రాసుపాములా అయోమయావస్థలో పడిపోయాడు. 'హుం' అంటూ బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంది. అది చూసిన

శాస్త్రి, "శ్రీరామచంద్రా! ఏమిఖర్మ మొచ్చిందిరా!" అనుకుంటూ కళ్ళు మూసుకున్నాడు. జాకెట్ బటన్స్ తీస్తున్న ఆమె ఫక్కున నవ్వటంతో కళ్ళు తెరవక తప్పలేదు. "ఏయ్! నువ్విలాంటి పిచ్చి పనులు చేశావంటే నేనెళ్ళిపోతా" అన్నాడు.

ఈ తఫా తెల్లబోవటం ఆమె వంతయింది.

"నేనందుకు రాలేదు."

"మరెందుకొచ్చారో?" మిగిలిన బటన్స్‌కూడా తప్పిస్తూ అంది.

"ఏయ్! ముందు బటన్స్ పెడ్తావా? లేచి పొమ్మంటావా?" అంటూ లేచాడు.

"కూర్చోండి... కూర్చోండి" అంటూ కూర్చోబెట్టి పవిట కప్పుకుంది.

"పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే నే వెళ్ళిపోతాను.... బుద్ధిగా నేనడిగిన దానికి సమాధానం చెప్పు. కావాలంటే మరో రెండు రూపాయలు ఎక్కువ తీసుకో" అంటు పుస్తకం తెరిచాడు.

నవ్వుని దాచుకుంటూ ఉత్సాహంగా అడిగిన దానికి ఏవేవో కల్లబొల్లి కబుర్లు చెప్పసాగింది. అతని చేతిలోని కలం వంద మైళ్ళ వేగంతో పరుగెత్త సాగింది. పేజీలు తిరిగి పోతున్నాయి. అంతలో భుజం మీద తట్టినట్లుంటే "చూడమ్మాయ్! ఇలాటి పిచ్చి వేషాలు నా దగ్గర కుదరవని ముందే చెప్పాను." తలెత్తకుండానే సమాధాన మిచ్చాడు.

తిరిగి భుజం మీద బలంగా తట్టినట్లుంటే "నీకే చెప్పేది. ఇలాగయితే నే వెళ్ళిపోతా!" అంటూ తలెత్తిన వాడల్లా ఎర్రటి టోపీ, పంగనామాలు, బుర్ర మీసాల్ని చూడగానే విలువు గుడ్లు వేశాడు. చేతిలోని కలం జారి క్రింద పడిపోయింది. "చూడబోతే చదువుకున్న వాడిలా వున్నావు....బుద్ధుండక్కర్లా ... లేలే!" గద్దించాడు ఎర్రటోపీ.

"సార్ ....సార్! నేనందుకు రాలేదు సార్.... నేను కవిని సార్...."

"స్టాప్....స్టాప్....పస్టు గెటప్!"

"సా....ర్"

"ముందు లేస్తావా? నాలుగు తగిలించ మంటావా?" అంటూ లాఠీ ఎత్తాడు.

ఒక్క ఉదుటున లేచాడు.

"నడు స్టేషన్‌కి ముందు....నాలుగు రోడ్లు త్రిప్పితేనే గాని రోగం కుదరదు."

"సార్... నేనందుకు రాలేదు"

"దూడ మేత కోసం తాడిచెట్టెక్కానంటే ఎవరు నమ్ముతారోయ్?" అని "నడు ముందు" అంటూ గర్జించాడు.

"ఇప్పుడు నన్ను రోడ్లెమ్మట త్రిప్పుతారా?" గజగజ వణికి పోతూ అడిగాడు.

"ఆహాఁ" చిద్విలాసంగా సమాధాన మిచ్చాడు పంగనామాలు.

"సార్! నా తప్పు క్షమించండి. మీ కాళ్ళు పట్టుకుంటాను"

"ఉహూఁ"

"సార్....కావాలంటే నా జేబులో డబ్బులన్నీ తీసుకోండి."

"ఎంతుంది. తియ్యి."

జేబులో రూపాయలన్నీ తీసి, "పాతిక" అన్నాడు ఏడుపు గొంతుతో.

"పాతికా!....మాయస్పైగారి బ్రాందీ బాటిల్‌కి కూడ చాలవే!"

"కావాలంటే ఈవాచ్ కూడ తీసుకోండి...." అంటూ వాచ్ తీయబోయాడు కాని, "వాచ్ తీయకు బాబూ— ప్రొద్దున్నే వెంకటేశ్వర స్వామికి కొబ్బరికాయ కొట్టి మరీ వచ్చాను....ఆ చేతుల్తో ఈ పాపపు సొమ్ము ముట్టుకోను" అంటూ పాతిక రూపాయలు పాకెట్‌లో వేసుకున్నాడు.

"ఇంక నే వెళతాను సార్!"

"ఆఁ" అని, "నీ పేరేమన్నావ్?" అనడిగాడు.

చెప్పాడు.

"ఏ కాలేజీ?"

చెప్పాడు.

"ఇలాటి చోటుకి రావచ్చా?"

"తప్పయింది సార్"

"ఇహ మరోసారి రాకు." ఫోజొకటి పెడ్తూ అన్నాడు. 'బ్రతుకు జీవుడా' అనుకుంటూ బయట పడ్డాడు పిచ్చికవి ఉరఫ్ గణపతి శాస్త్రి.

# 8

చీకటి తెరలు చిక్కగా వ్యాపించుతున్నాయి. ఇంటి ముందర ఆగున్న కారుని చూసి నడక వేగం హెచ్చించింది కవిత. కాని ఆమె గమ్యం చేరుకునేలోపునే ఒక వ్యక్తి ఇంట్లోనుంచివచ్చి కారు ఎక్కడం తల్లి వీడ్కోలివటం, ఆ కారు కదిలిపోవటం జరిగిపోయాయి.

"ఎవరై ఉంటారబ్బా!" అనుకుంటూ ఇంట్లోకి అడుగు పెట్టిన కవితకి, కన్నీరొత్తుకుంటున్న తల్లి తన రాకను గమనించి త్వర త్వరగా వంటింట్లోకి వెళ్ళటం కనిపించింది. వెనకాలే వెళ్ళి. "ఎవరమ్మా మనింటికొచ్చింది?" అనడిగింది.

"మనింటికా.... అబ్బే.... ఎవరూ రాలేదే!"

ఇహ తల్లిని రెండవ ప్రశ్న వేయలేక కాళ్ళీడ్చుకుంటూ మధ్యహాలులో కొచ్చింది. మంచంకోడు దగ్గర పడున్న రెండు సిగరెట్ పీకలు ఆమె కంట బడ్డాయి.

"మగదిక్కులేని ఈ ఇంటికి నాకు తెలియని వ్యక్తెవరో వచ్చి పోవటమా?" మంచంమీద కూర్చుంటూ ప్రశ్నించుకుంది కవిత.

* * *

వెలుతురింకా మాయము కాలేదు. అలాగని, సంజ చీకట్లు క్రమ్ముకునలేదు. విరజాజుల ఘుమ ఘుమల్ని నలుదెసలకు తీసుకు పోతున్నాయి పిల్ల తెమ్మెరలు, ఆ సుమధుర సమయంలో లాన్‌లోని ఈజీచైర్‌లో పడుకుని టేప్ రికార్డర్ వింటున్న రావుగారి మస్తిష్కంలో గతం మెదిలింది—

ఆవేళ వైశాఖదీపోత్సవం. శాంతినికేతన్‌లోని కుటీరాలన్నీ చెయ్యీ చెయ్యీ కలిపినట్లు వెలుగురేఖల్ని విరజిమ్ముతున్న ప్రమిద లతో మెరిసిపోతున్నాయి. మనిషి వెలిగించిన ఆ జ్యోతులు ముసిరి వచ్చే చీకట్లని మ్రింగివేస్తున్నాయి.

ఆ చీకట్లో మెరిసిపోతున్న ఆ విద్యుల్లతని తిలకిస్తూ అడుగు వెంబడి అడుగు వేసుకుంటూ నడుస్తున్న రఘు శ్రవణానందకరమైన స్వరం వినరాగా అప్రయత్నంగా ఆ వైపు అడుగులేశాడు. ముకుళించిన మల్లెలమధ్య కూర్చుని వీణమీటుతున్న ఆ లతాంగిని చూడగానే రఘుహృదయం పురివిప్పిన నెమలిలా నాట్యమాడసాగింది. అంతలో, "డాడీ!" అన్న పిలుపు వినరాగా తృళ్ళిపడి ఈ లోకంలో కొచ్చారు రావుగారు.

"ఖాళీ జేప్ రివాల్వ్ అవుతుంది." అని, "ఏమిటంత పరధ్యానంగా ఉన్నారు?" అనడిగాడు సంజీవ్.

"బాబూ!" అంటూ పరిశీలనగా సంజీవ్ ముఖంలోకి చూసి, "ప్రతి మనిషి జీవితంలో 'తన వారు' అన్నవారి జ్ఞాపకాలు ఏకో ఒక రూపాన చుట్టుముడ్తూనే ఉంటాయి. ఆ వ్యక్తి భావజలధిలోని పగడాల్లాంటి జ్ఞాపకాలతో 'తనవాళ్ళు' అన్న పగడాలదండ కూరుస్తాడు. ఈ 'తనవారు' అన్నది సృజనంకావచ్చు, ఆత్మ బంధువులు కావచ్చు. అది ఆ మనస్సుకే అర్థమయ్యే ఒకానొక సూక్ష్మపదార్థం" గాద్గిక స్వరంతో పలికారు రావుగారు.

"డాడీ!"

"హుం! సంజీవ్! మానాన్నగారు మీ నాన్నలా మనిషిని అర్థం చేసుకునే వ్యక్తికాదు బాబూ....అందుకేనా కళ్ళముందే ఘోర కలి జరిగిపోయినా...." అంటూ బాధగా కళ్ళు మూసుకున్నా రాయన.

తండ్రి జరిగిపోయిన జ్ఞాపకాలను గుర్తుచేసుకుంటున్నారని గ్రహించాడు. ఆయన మనస్సుని మళ్ళించాలని, "ఈ ఆర్ట్ ఎలాగుంది?" అంటూ చేతిలోని తైలవర్ణ చిత్రం చూపించాడు సంజీవ్. అది సీతా రామ లక్ష్మణుల చిత్రం.

"ఎవరేశారు?" లో స్వరంలో అడిగారాయన.

"ప్రభు."

"దానిలోని ప్రత్యేకత గమనించావా?"

"అఁ డాడీ! ఇది నాకిష్టమైనది. అందుకే నాకోసం వేశాడు."

"నీవు రామ భక్తుడివా సంజీవ్?"

"నో.... డాడీ! ఈ రామపాత్రని కొన్ని ఆదర్శాలకోసం

సృష్టించాడు కవి. అందుకే నాకు యిష్టం. కాని రాముడి కేరక్టర్ కంటే నాకు లక్ష్మణుడి కేరక్టర్ బాగా నచ్చింది"

"ఆదేం....?" అంటున్న రావుగారి చెయ్యి అప్రయత్నంగా టేప్ రికార్డర్ బటన్ మీద పడింది.

"అన్నను డాడీ! అన్నకోసం రాజభోగాల్ని, నవయవ్వనవతి అయిన భార్యనికూడ వదులుకుని అరణ్యాలకొచ్చాడు లక్ష్మణుడు. రెప్పవాల్చకుండా, పిసరంతైనా విశ్రాంతిలేకుండా అన్నకి సేవ చేశాడు. కాని తననే నమ్ముకుని తన వెంట అరణ్యాలకొచ్చిన సీతని శంకించి అగ్ని ప్రవేశం చేయించాడు రాముడు. తిరిగి లోకభీతికి సీతనే పరిత్యజించాడు...."

"అక్కడ ప్రజాపాలకునిగా తీసుకోవాలి సంజీవ్."

"కాని ధర్మార్థ కామ మోక్షాలందు పాలుపంచుకుంటానని అగ్నిసాక్షిగా ప్రమాణంచేసి ఆమె నిరపరాధి అని తెలిసినా నిర్దాక్షిణ్యంగా అడవులకి పంపేశాడు."

"బాధ్యతగల వ్యక్తి....అందునా ఒక సామ్రాట్టు, పరిస్థితుల ప్రభావంతో అలా చేయక తప్పదు."

"డాడీ! సీత తన భార్యే కావచ్చు....కాని తన రాజ్యంలోని ఒక వ్యక్తి ఎవడో ఏదో అన్నాడని న్యాయాన్యాయాలు విచారించకుండా ఒక నిరపరాధిని అందునా నిండు చూలాలనికూడా విచారించకుండా దండించే అధికారం ఏ ప్రజాపాలకుడికి లేదు. అలాటి పక్షంలో భార్య అయిన ఊర్మిళాదేవిని వదిలి అన్న అడుగుజాడల్లోనే నడచిన లక్ష్మణుడు నిజంగా త్యాగనిరతుడు. నేను ఇష్టపడటమంటూ జరిగితే అది లక్ష్మణున్నే. నిజంగా నాకూ ఒక అన్న ఉంటే ఆ లక్ష్మణుడిలాగానే నా అన్నని సేవించి తరించేవాడ్ని...."

"సంజీవ్!" గద్గద స్వరంతో అని, "వద్దు....బాబూ అలాటి మాటలనవద్దు.... ఒకనాడు మీ అమ్మకూడా ఇలాగే...." అంటున్న రావుగారి ముఖం వివర్ణమయింది. చివరకు "ఇప్పటికే మీ అమ్మని దూరం చేసుకుని నేను అనుభవిస్తున్న బాధ చాలు.... ఇహ నీవు కూడ నా కంటికి దూరం కావద్దు." విషాద స్వరంతో పలికారాయన.

"హాఁ! డాడీ!" అంటూ లేచి లోపలికి నడుస్తున్నవాడల్లా, "సంజీవ్!" అన్న రావుగారి పిలుపు వినబడి ఆగి, 'ఏమిటి?' అన్నట్లుగా వెనుదిరిగి చూశాడు.

"ఆ చిత్రంలోని వ్యక్తుల్ని పరిశీలనగా చూడు" అనగానే చూడక తప్పలేదు. శ్రీరాముడిలో ప్రభు రూపురేఖలు, సుస్పష్టంగా కనిపించసాగాయి. ఆ ప్రక్కన తేనె తొణికిసలాడుతున్న కళ్ళతో ఇంద్ర ధనుస్సులాంటి కనుబొమ్మలతో లక్ష్మణుని స్థానంలో ఉన్నది ఎవరో గాదు. సంజీవ్.

"ప్రభూ! మూగబోయిన మనస్సుని మాట్లాడించగల శక్తి నీ కుంచెకుంది." తృప్తిగా కాంతులీనే కళ్ళతో చూస్తూ అనుకుంటూ దృష్టిని ప్రక్కకు త్రిప్పి సీతాదేవి స్థానంలోవున్న కవితని చూసి అవాక్కయిపోయాడు. అతని హృదయం పమ్మెటపోట్లకు గురయింది. భారమైన హృదయంతో మెల్లిగా నడుచుకుంటూ వెళ్ళాడు.

* * *

ప్రేమికులకు విరహమనేది వసంతకాలంలోని వడగాల్పు లాంటిది. కవిత కనిపించి పదునెనిమిది గంటలయిందో లేకో ఎన్నో యుగాలయినట్లుంది ప్రభుకి. ఆమెకోసం కాంపస్‌నంతా వెదికాడు. ఫలితం శూన్యం. లైబ్రరీలోకి వెళ్ళి టేబిల్ ముందు కూర్చున్నాడు. పుస్తకం పేజీలు మాత్రం యాభైమైళ్ళ స్పీడుతో తిరుగుతున్నాయి. కాని అతని కళ్ళేమో ఎక్కడెక్కడో విష్ప్రయోజనంగా వెదుకుతున్నాయి.

అంతలో, "ఏమిటోయ్ వెతుకుతున్నావ్?" అన్న లెక్చరర్ మాట విని, లేటెస్ట్ థీరీస్ సార్!" టక్కున సమాధానమిచ్చాడు.

"నువ్వు చూసే పుస్తకంలో నీకు థీరీస్ దొరుకుతాయా? లోపికెళ్ళి లేటెస్ట్ సైన్స్ రిపోర్టర్ చూడు" అన్నాడు లెక్చరర్.

"థాంక్యూ సార్!" అంటూ రిఫరెన్స్ సెక్షన్‌లోకి నడిచాడు ప్రభు. వరుసలుగా పేర్చి వున్న షెల్ఫ్‌స్ మధ్య నిల్చుని ఏవో బుక్స్ తిర గేస్తున్నారు కొందరు. వారిలో ఎక్కడైనా కవిత కన్పిస్తుందేమో నన్న ఆశతో పరీక్షగా చూడసాగాడు. అంతలో బోటనీ లెక్చరర్

రావటంతో అందుబాటులోనున్న షెల్ఫ్‌నుంచి పుస్తకాలు తీయ సాగాడు. ఆయన వెళ్ళిపోవటంతో తిరిగి ఆ పుస్తకాన్ని సీరియల్ వారిగా పెడ్దామన్న ఉద్దేశ్యంతో ఒక ప్రక్కకు వాలిపోయిన పుస్త కాల్ని చేతితో లేవనెత్తాడు. అంతే।

షెల్ఫ్‌కి అవలివైపున నిల్చుని బుక్ చూస్తున్న కవితను చూడ గానే "హాయ్....కవితా।" అని అప్రయత్నంగా కేకవేశాడు ప్రభు.

"ఉష్...." అని పెదవులకడ్డంగా చూపుడువ్రేలి నుంచుతూ 'మాట్లాడొద్దు' అన్నట్లుగా సంజ్ఞ చేసింది.

"డార్లింగ్।" అంటూ షెల్ఫ్‌మీదకి వంగి గాలిలో ముద్దు విసరబోయాడు. కాని ఆమె తటాలున చేతిలోని పుస్తకాన్ని షెల్ఫ్ మీద అడ్డంగా పడేసింది.

"యూ....సిల్లీ." అంటూ పుస్తకం తీశాడు. కాని ఆమె కనిపించలేదు. వెంటనే తిరిగి ఆ వైపుకి నడిచాడు. కాని చరచరా నడుస్తున్న ఆమెను చూసి ఉసూరోమంటూ అనుసరించాడు.

రీడింగ్ టేబుల్ దగ్గరకెళ్ళి కూర్చుంది కవిత. ముఖంమీదకి పడ్తున్న జుట్టుని ఎగదోసుకుంటూ చెమట తుడుచుకుంటున్నట్లు నటిస్తూ ఫ్యాన్ దగ్గర కూర్చునే మిషతో వెళ్ళి ఆమె ఎదురుగా కూర్చున్నాడు ప్రభు. ఆమె మాత్రం పుస్తకంలోనుంచి తలఎత్తే ప్రయత్నం చేయలేదు. చేతికందిన పుస్తకాన్నందుకుని పేజీలు తిరగ వేయసాగాడు. అంతా తమ పనిలో మునిగి ఉన్నారు. చీమ చిటుక్కు మన్నా వినిపించేటంతటి నిశ్శబ్దం అలుముకుంది. ఆమె తన వైపు చూస్తూందేమోనని క్రీగంట చూశాడు. కాని ఫలితం శూన్యం. అంతా పరుగులిడే కాలంతో పోటీపడి చదువుతున్నారు. ఆమెనెలా పిలవాలో అర్థం గాలేదు. కనీసం ఒక్కసారయినా తలెత్తితే బాగుణ్ణు అను కున్నాడు. ఆమె అలాంటి ప్రయత్నమేమీ చెయ్యకపోవటంతో మెల్లిగా కాలు ముందుకు జరిపి ఆమె వ్రేళ్ళమీద అదిమాడు. కళ్ళ యినా ఎత్తకుండా పెల్లుబికే నగవుని పెదవుల చాటునే దాచుకుంటూ చెప్పుని అతని బూటుక్రిందే వదిలి కాలినిమాత్రం వెనక్కు లాక్కుంది. ఉక్రోషంతో కాలిని వెనక్కు లాక్కున్నాడు ప్రభు. అంతలో గోడగడియారం ఒక గంట కొట్టి అలిసిపోయిన దానిలా

ఆగిపోయింది. తిరిగి ఆమె కాలుకు చెప్పు ధరించటం అతని కంట పడక పోలేదు. అతని మదిలో చక్కని ఆలోచన తట్టింది. వెంటనే తెల్లకాగితం తీసి ఏదో సీరియస్‌గా వ్రాసి, ఆ ముక్కని చించాడు. అప్పటివరకు అతనిముందు టేబుల్‌మీదున్న 'కీ' చైన్ జారి క్రింద పడింది. చైన్‌కోసం క్రిందకు వంగాడు.చైన్‌తీసుకుంటున్న ఆ చెయ్యి మరొత బెట్టిన ఆ కాగితపు ముక్కని విశ్శబ్దంగా ఆమె కాలి వ్రేళ్ళ మధ్య గుచ్చింది. అవాక్కయి పోయిందామె. కాని ఆమె ఆశ్చర్యా న్నుంచి తేరుకోక పూర్వమే చిరునగవుతో అతడు లైబ్రరీ విడిచి వెళ్ళిపోయాడు. కాలు గోక్కుంటున్నట్లుగా వంగి వ్రేళ్ళమధ్యనున్న ఆ కాగితపు ముక్కని చేతిలోకి తీసుకుంది. ఇంటర్‌లీఫ్‌గా ఆ కాగి తాన్ని పుస్తకంలో పెట్టిచూసింది.

"ఈ వేళ క్లాసుకి రాను. రూములోనే వుంటాను" అన్న వాక్యాలు చదివి "ఓ మైగాడ్!" అనుకుంది. అంతలో కాలేజీ బెల్ వినిపించటంతో లైబ్రరీ విడిచి బయటకు నడిచింది. పిట్టగోడదగ్గర నిల్చుని కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తున్న ప్రభు ఎంట్రెన్స్ దగ్గర మెరసిన మెరుపుని చూసి ఎగిరి గంతేసినంత పని చేశాడు. ధవళరంగు అంచున్న గులాబీ రంగు చీరలో, కాటుక దిద్దినకళ్ళతో పసిడి మేనుఛాయతో అజంతాసుందరిలాగున్న ఆమెనే చూస్తూ రెప్పవేయటమే మర్చిపోయాడు. వొదులొదులుగా వేసుకున్న దీర్ఘ మైన ఆ జడ గుండ్రని పిరుదులపై నాట్యమాడుతుంటే ఆ చిత్ర కారుని హృదయం వింత భావనలతో స్పందించసాగింది. ఒక్కొక్క మెట్టే ఎక్కి వచ్చిన కవిత, తెల్లని ఫాంటులో షర్ట్ టక్ చేసుకుని కోర్కెలు నిండిన కళ్ళతో తనరాకకే ఎదురుచూస్తున్న ప్రభుని చూస్త గానే సిగ్గుదొంతరలు తెలిమబ్బులా ముఖాన తేలియాడగా నడవటమే చేతగానిదానిలా తడబడుతూ నడవసాగింది. అతి కష్టంమీద మనస్సుకి పగ్గాలువేసి గదిలోకి నడిచాడు. ఆమె మౌనంగా ద్వారం దగ్గర నిల బడిపోయి నేల దృక్కులతో కుడి బొటనవ్రేలు వ్రాస్తూ నిల్చుండి పోయింది. కిటికీగుండా ఎక్కడో దూరాన కలుసుకుంటున్న నింగినీ నేలనీ చూస్తుండిపోయాడు ప్రభు. ఇద్దరిమధ్యా మౌనం విలయ తాండవ మాడసాగింది. క్షణాలు నిమిషాల్లా దొర్లిపోసాగాయి. ఆ

మౌనాన్ని భరించలేక తలెత్తి పిలవబోయింది. కాని పెదవులు కంపించిసాగాయేగాని మాటలు వెలికి రాలేదు. సరిగ్గా అదే సమయంలో వెనుదిరిగిన ప్రభు కళ్ళు ఆమె రెండు కళ్ళతో కలుసుకున్నాయి. క్షణక్షణానికి బరువెక్కుతున్న హృదయాన్ని అతి భారంగా కదుల్చుకుంటూ ఆమె కధోముఖంగా చేరి మునివ్రేళ్ళతో ఆమె చుబుకం పట్టుకుని లేవనెత్తుతూ."కవితా,నాలో నీవు వ్యాపించిపోయావుగదూ!" అనడిగాడు. అర్థంగాక చూపిందామె.

"అవును కవితా. నీ కళ్ళల్లో కనిపించేది నా రూపమే." బాహువుల మధ్య ఆమెను బంధించుతూ అన్నాడు.

అతని బాహుబంధాల్నుంచి మృదువుగా తప్పించుకుని తలుపు గడియపెట్టింది.

"కవితా! కత్తిలేకుండా, రక్తం చిందకుండా గుండెనుకోసి కన్నీటిని రుచి చూపించగల శక్తి స్త్రీకే ఉందికదూ!"

"కత్తివేటు పడితేగాని నెత్తురురాదు, ప్రేమిస్తేగాని హృదయం వగలదు"

"కవితా!" అంటూ ఆమె ముఖాన్ని దోసిట్లోకి తీసుకొని, "ఆ చిత్రకారుని ప్రతిభ చూశావా? తెల్లని కనుగుడ్లమీద నల్లని కంటిపాపనుపెట్టాడు. ఈ తెల్లని గుడ్డుకి నల్లని కాటుకపూసి మరింత శోభగా తీర్చి దిద్దావు" అన్నాడు.

"ప్రభూ! ప్లీజ్ మాట్లాడకు....సంతోషముతో నాగుండె పగిలిపోయేలాగుంది" అర్థనిమీలిత నేత్రాలతో చూస్తూ అన్నది.

"లేదు కవితా! నా అదృష్టానికి నేనే ఈర్ష్య పడ్తున్నాను. పాలరాతి బొమ్మలాగున్న నిన్ను చూస్తుంటే ఏం చేయాలో అర్థం కావటంలేదు." ఒక చేతిని ఆమెవీపు వెనుకకు, రెండవ చేతిని ఆమె ముంగురులలోనికి చొప్పిస్తూ అన్నాడు.

"అందమైన బొమ్మతో ఆడుకుంటావా?" మురిపెంగా చూస్తూ అడిగింది.

"తీర్చి దిద్దిన ఈ కళ్ళని, సన్నని ఈ పెదవుల్ని చూస్తుంటే విశ్వకర్త నాకోసమే నీకు ప్రాణం పోశాడు కాబోలు అనిపిస్తుంది"

"బాగుంది సరసం" మూతిని సున్నలాపెడ్తూ అన్నది.

"కవితా" అంటూ రెండుచేతుల్ని ఆమె భుజాలమీదగా వేసి నడుం నితాకూతూ, "నీవు నడుస్తుంటే,నాకెంత భయంగా ఉంటుందో తెలుసా?" అనడిగాడు.

"ఎందుకో?" చెవి దగ్గర గొణిగింది.

"ఉన్నతమైన నీ వయసు భారానికి ఈ పిడికెడు నడుం ఎప్పుడు విరిగి పోతుందోనని!"

"ఛ! మరీ అల్లరివాడివై పోతున్నావ్!" మరింత దగ్గరవుతూ అన్నది.

"అవును కవితా! పండువెన్నెల్లో నీ ఒడిలో తలపెట్టుకుని కళ్ళల్లోకి చూస్తూ నన్ను నేనే మరిపోవాలని నా ఆశ."

అంతలో "ప్రభూ....ప్రభూ!" అంటూ ఎవరో తలుపు బాదినట్లుంటే ఆ బిగికౌగిలి సడలక తప్పలేదు.

మెల్లగావెళ్ళి తలుపుతెరిచాడు. ఎదురుగా జేవురివారిన ముఖంతో క్రోధంతో మండిపోతున్న కళ్ళతో నిల్చునున్నాడు సంజీవ్.

"సంజీవ్ ..." తెల్లమొహం వేసుకుని అన్నాడు ప్రభు.

"ఆc" అని "నీతోచాల అర్జంట్ పనుంది. పద...."అంటూ చెయ్యి పుచ్చుకున్నాడు.

"ఇ....ఇప్పుడా?"

"నోమోర్ కన్వర్సేషన్....ఫాలోమీ" అంటూ చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళినంత పని చేశాడు.

సంజీవ్ చేతిలో నుంచి చేతిని విడిపించుకోలేక సతమతమవ్తూ సాగాడు ప్రభు. కాంపౌండ్‌లో నడుస్తూ వెనుతిరిగి చూసిన ప్రభుకి డోర్ దగ్గర ప్రతిమలా నిల్చుండి తనవైపే చూస్తున్న కవిత కనిపించింది.

కాని ప్రభు మనస్సు కవిత చుట్టూ తిరుగుతున్నా, శరీరం మాత్రం సంజీవ్‌తో పయనించక తప్పలేదు. ఇద్దరూ కారులో కూర్చున్నారు. కారు వేగాన్నందుకుంది. డ్రైవింగ్ సీట్లో కూర్చున్న సంజీవ్ సిగరెట్ నోట్లో పెట్టుకున్నాడు.

అగ్గిపుల్లఅంటిస్తూ,"సంజీవ్ ఎక్కడికి మనమెళ్ళేది?"అడిగాడు

ప్రభు సుతారంగా సిగరెట్ పొగవదుల్తూ, "ఈ వేళ నీవూ, కవితా ఆలో చించే క్లాసులు మానేశారు కదూ!" అడిగాడు.

"అఁ! కవితా, నేను ప్రేమించుకుంటున్నాం...."

అప్రయత్నంగా కారు సడన్ బ్రేక్ వేశాడు సంజీవ్.

"మేమిద్దరం పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాం"

"వాట్ నాన్సెన్స్ యు ఆర్ టాకింగ్" చేతిలోని సిగరెట్‌ని స్టీరింగ్‌వద్ద నున్న యాష్‌ట్రేలో నులుముతూ అన్నాడు.

తిరిగి... "ఆమె ఎవరో తెలుసా!" అనడిగాడు.

"బాగా తెలుసు. ఒక మనసున్న మగువ"

"నో...ఆమెతల్లి ఆఫ్టరాల్ ఒక స్కూలు టీచరు. ఆమె స్టేటస్ ఏమిటి? మనస్టేటస్ ఏమిటి?"

"సంజీవ్. మనువుకి మనస్సు ముఖ్యం కాని, మనిషి సృష్టించు కున్న స్టేటస్ కాదు."

"డోన్ట్ బి ఫూలిష్"

"మిద్దెల్లోని మట్టిబొమ్మల కన్నా ఆమె వెయ్యిరెట్లు మెరుగు. నన్ను నన్నుగా గుర్తించి నన్నుగా ప్రేమించింది. వివేకవతి అయిన స్త్రీ సహచర్యం నా జీవితాన్ని తీర్చిదిద్దుతుందన్న నమ్మకం నాకుంది"

"నో...ఆమె రూపవతి ఆడవాళ్ళనే పిచ్చెక్కించే ఆమె అంగ సౌష్టవాన్ని చూసి ఆమెకు దాసోహమన్నావు. అందగాడివి. విద్యా వంతుడివి. వేల రూపాయలకి వారసుడివని ఆమె వలపన్నింది. ఆ వలలో చిక్కుకున్నావ్"

"సంజీవ్!" అంటూ అగ్గిపుల్ల వెలిగించి "అగ్గిపుల్ల వెలిగిస్తే అంటుకుంటుంది. కాని మొగ్గ పక్వానికి కోస్తేగాని వికసించదు. అలాగే ప్రేమఅనేది జ్వలించే సరుకుకాదు. పుష్పించేది"

"నా బాధని నీకెలా చెప్పను ప్రభూ." కణతలు నొక్కు కుంటూ, స్టీరింగ్‌మీద తల ఆనించాడు.

"సంజీవ్! ఈ లోకంలో నాకష్టసుఖాల్లో పాలుపంచుకునేవారు లేరు. ప్రాణంలేని మట్టిబొమ్మలా చైతన్య రహితమైన పాతికేళ్ళ జీవి తాన్ని గడిపాను. ఈ వేళటికి మృగతృష్ణ లాంటి నా జీవితంలో ఒయాసిస్సు వెలిసింది. నీవన్నట్లుగా నాకు బ్యాంక్ బాలెన్స్ ఉంది.

కాని అది ఏ రకంగానూ నాకు మనశ్శాంతిని కల్గించలేక పోతుంది. అలాటి ఈ సందర్భంలో ఆస్థి, అంతస్థు, హోదా అంటూ చేతికందిన పెన్నిధిని చేజార్చలేను. సంజీవ్! కవిత సాంగత్యంలో నాకు ప్రశాంతత దొరుకుతుందనే ఆశిస్తున్నాను, ప్లీజ్! నన్నర్థం చేసుకో.... ఈ ఒక్క విషయంలో నయినా.... నన్నభ్యంతర పెట్టకు."

"ప్రభూ! నీవు సుఖపడితే నాకదేచాలు. ఇందులో ఆత్మీయత లకి అనుబంధాలకి తావులేదు. ఏది ఏమైనా నీకోర్కె నెరవేరేలా నేను చూస్తాను." అంటూ కారుస్టార్టు చేశాడు సంజీవ్.

# 9

అన్య మనస్కంగా నడుస్తున్న కవిత బార్లా తెరిమన్న ఇంటి తలుపుల్ని చూసి బెంబేలు పడిపోతూ ఒక్క ఉదటున ఇంట్లోకి నడిచింది. చెంపకు చేతిని చేర్చి కుర్చీలో చేరగిలబడి కూర్చున్న తల్లిని చూసి విస్తుబోయింది. సరిగ్గా ఆ సమయంలో స్కూలులో ఉండవలసిన తల్లి ఇంట్లో....తలను ప్రక్కకు త్రిప్పిన కవితకి మంచం కోడు దగ్గరపడున్న సిగరెట్ పీకలు కనిపించాయి. విరక్తిగా నవ్వింది.

ఆ నవ్వు ఆ తల్లి హృదయపు పొరల్ని తొలిచివేయగా పగిలిపోయే గుండెల్ని నొక్కి పట్టుకుంటూ, "అప్పుడే వచ్చేశావేమిటమ్మా?" అనడిగింది,

"తప్పయి పోయిందమ్మా" అంటూ గదిలోకి నడిచింది కవిత.

అంతే!!

ఆ తల్లి గుండెల్లో అగ్ని పర్వతాలు బ్రద్దలయ్యాయి. గాజు కళ్ళల్లో నీరు చిప్పిల్లింది. అంతలో కారు వచ్చి ఆగిన శబ్దం వినరావటంతో భీతిగా ద్వారం వైపు చూసింది.

"ప్రభూ! నీవు కారు తీసుకుని హాస్టల్ కెళ్ళిపో.... నేను కవిత అమ్మ గారితో మాట్లాడి తిన్నగా హాస్టల్ కొస్తాను" అని సిగరెట్ పొగ సుతారంగా వదుల్తూ లోపలికి అడుగు పెట్టాడు సంజీవ్. ఎర్రని

ఛాయతో కాంతిలేని కళ్ళతో వంకులు జుత్తుతో గడప దగ్గర నిల్చొంది పోయిన ఆ భారీ శరీరాన్ని చూడగానే ఆమె భృకుటి ముడివడింది.

"నమస్తే" అంటూ చేతులు జోడించి "నా పేరు సంజీవ్.... కవిత క్లాస్‌మెట్‌ని" అన్నాడు.

"మంచిది బాబూ! కూర్చో." అంటూ మంచం చూపించి 'కవితా!' అని కేక వేసింది.

"కవిత ఇంట్లోనే ఉందా?" అని "మీతోనే పనుండి వచ్చాను" అన్నాడు.

"నా తోనా!"

"అవునండీ. స్కూలుకి వెళ్ళాం... కాని మీరు లేరని తెలియ టంతో ఇలా వచ్చాము" అంటూ చేతిలో సిగరెట్‌ని జారవిడిచాడు. అప్పుడే వచ్చిన కవితని చూసి విష్ చేసి,

"కాఫీ ఇచ్చే ప్రయత్నమేదైనా చేస్తావా?" క్రొత్త సిగరెట్ తీస్తూ అడిగాడు.

"అలాగే" అంటున్న కవిత దృష్టి కాల్తున్న సిగరెట్ మీద పడడంతో తలెత్తింది. సిగరెట్ నోట్లో పెట్టు కుంటున్న సంజీవ్ కని పించాడు. కాల్తున్న సిగరెట్‌ని దాని ప్రక్కనే వున్న పీకల్ని మార్చి మార్చి జూసింది. తేలిక పడ్డ మనసుతో లోపలకి నడిచింది.

"నేను జ్యోతి ఇండస్ట్రీస్ డైరెక్టర్...."

"రావు గారబ్బాయివి" నవ్వుతూ వాక్యాన్ని పూరించిందామె.

"అరే, నేను మీకు తెలుసన్న మాట"

"తెలుసు బాబూ" అని "నేనేమైనా నీకు సహాయం చేయ గలనా?" అనడిగింది.

తలపంకించి "ప్రభు అని, నా ఫ్రెండున్నాడు. వెలుపలంతా వెలుతురైనా, హృదయంలో జ్ఞాన జ్యోతులు వెలుగుతున్నా ఏదో చీకటి లోకంలో విహరిస్తుంటాడు. అలాటి వాడు - 'సంజీవ్! నేను ఫలానా అమ్మాయిని ప్రేమించాను. ఆమెతోనే జీవితాన్ని పంచు కుంటాను.' అన్నాడు ఆ పని మీద వచ్చాను" చెప్పాడు.

"అర్థమయింది బాబూ!" అంటూ ఆలోచనల్లో మునిగి పోయింది.

"ఆర్థికంగా నైతికంగా ప్రభు అల్పుడు కాదండీ!"

"మీలో ప్రవహించే రక్తం అలాంటిది బాబూ"

"మరి మనసులు కలిసిన వారిని దరిజేర్చటానికి ఎందుకాలో చిస్తున్నారు?"

సంజీవ్ ముఖంలోకి పరిశీలనగా చూసి "ఒక్క నిముషం" అంటూ లేచి పాత పెట్టిలో వున్న ఫొటో తీసుకొచ్చింది.

"బాబూ! ఈ ఫొటోలో వీణ ముందు కూర్చున్నది నా స్నేహితురాలు జానకి. ఆమె గాత్రం బాగుంటుంది. రూపం బాగుంటుంది. కొన్ని ఏళ్ళ క్రిందటి సంగతి.....

"ఆ వేళ వైశాఖ దీపోత్సవం. శాంతినికేతన్ లోని కుటీరాలన్నీ ప్రమిదలతో అలంకరింప బడున్నాయి. పద్మాకృతిలో అలంకరింప బడిన ప్రమిదల మధ్య కూర్చుని వీణ మీద పాట పాడుతుంది జానకి. పాట ముగించి తలెత్తిన ఆమె ఉసిరి చెట్టు ప్రాను దగ్గరే నిల్చుని తన్మయావస్థలో మునిగివున్న వ్యక్తిని చూసి సిగ్గుతో లోపలి కొచ్చింది. కాని ప్రతిరోజూ ఆమె పాట వినటానికి ప్రాను దగ్గర నిల్చోవటం అతని దినచర్యలో ఒక భాగమయింది. ఒక కళాకారిణికి తన కళని ఆస్వాదించే వ్యక్తి దొరికితే చాలు. ఆమె సంతోషానికి హద్దులుండవు. క్రమ క్రమంగా అతని రాక కోసం ఆమె కన్నులు ఎదురు చూసేవి. ఒక వేళ అతడు ఉసిరి చెట్టు దగ్గర కన్పించక పోతే మూగ బోయిన దానిలా దిక్కులు చూస్తూ వీణ ముందే కూర్చునేది. కాలక్రమంలో వారి మనసులు పెనవేసుకు పోయాయి. ఆ పరిచయం మనసుల వరకే పరిమితం కాలేదు. శరీరాల వరకూ వ్యాపించింది. ఒకరిలో ఒకరు లీనమైపోయారు. ఆమె లేని అతడు సూర్యుడు లేని పగలు. అతడు లేని ఆమె చంద్రుడులేని రాత్రి. అతడా విషయాన్ని ఇంటి దగ్గర తెలియజేసే ప్రయత్నంలో ఉండగా పిడుగులాంటి వార్త. 'ఆమె గర్భవతి' అని తెలుసుకున్నాము. ఏం చేయాలి? అన్న ప్రశ్న దుర్భేద్యమైన గోడలా ముందు నిల్చింది. వంశం, ప్రతిష్ట అని ఊగిసలాడే అతడి తండ్రి ఆ విషయాన్ని క్షమించలేడు. అయినా సరే తండ్రి నెదిరించటానికి సిద్ధపడ్డాడు. కాని ఇంటి కొత్త కోడలు నిండుచూలాలుగా ఆ గడప

త్రొక్కితే అది ఆ ఇంటికి పరువు కాదని జానకి తిరస్కరించింది.

ప్రసవించిన తర్వాత పిల్లవాడ్ని నా దగ్గరొదిలి తర్వాత తీసు కెళ్ళవచ్చని సలహా యిచ్చాను. వారందుకు అంగీకరించక తప్పలేదు.

అంతలో కవిత కాఫీ కప్పు పట్టావటంతో సంభాషణ మారి పోయింది.

ఆమె చేతిలోని కాఫీ కప్పు అందుకొంటూ "ఆ తర్వాత?" అడి గాడు సంజీవ్.

"విధి వార్ని చిన్న చూపు చూసింది బాబూ! ఆ తల్లి పురిటింట్లో నుంచి బయటకు రాకుండానే ఆ బిడ్డను నా కప్పగించి కన్ను మూసింది."

"ఓ మై గాడ్!" తల పట్టుకున్నాడు.

"బాబూ! మానవ ప్రయత్నాలు నీటిమీద గీతల్లాంటివి. మనం విధి ఆడించినట్లల్లా ఆడే ఆటబొమ్మలం. లక్షాధికారి అయిన అతడి కంటి పాప ఆమె. కాని ఏం చేయగలడు?"

"మీ బాధ నా కర్థమయింది. కాని ఈ విషయంలో ఎందుకభ్యం తరం చెప్తున్నారో బోధ పడటం లేదు."

"హుం! బాబూ! ఈ ప్రేమ వివాహాలు మాకు కలిసి రావు. కలో గంజో త్రాగుతూ బ్రతుకుతున్న మమ్మల్నిలాగే బ్రతకనివ్వు"

విరక్తిగా నవ్వి అగ్గిపుల్ల గీసి ఇలా అన్నాడు. "అగ్గిపుల్ల కాలుకుంటూ వచ్చి చివరికిచేతినే కాలుస్తుందని ఎవరూ అగ్గిపుల్లని వాడకుండా వుండరు"

"బాబూ!"

"అవునండీ.... ప్రభు నాకు స్నేహితుడే గాదు. అన్నలాంటి వాడు. ఇంతవరకూ నోరు తెరవనివాడు ఈ వేళ నోరుతెరచి "సంజీవ్ ఆమె సాంగత్యంలో సుఖపడ గలనన్న నమ్మకం నాకుందిరా.... ఎండమావిలాంటి నా జీవితంలో ఒయాసిస్సు వెలసిందిరా" అన్నాడు వాడిలో ఏ తప్పు జూసి కాదంటున్నారు? మీతో వియ్యమందుకునే అర్హత వాడికి లేదా?"

"బాబూ!...."

"పోనీ మీ అమ్మాయి పేర ఎన్ని లక్షలు డిపాజిట్ చేయ మంటారు?"

"సంజీవ్. అంతలేసి మాటలనకు....ప్లీజ్।"

"మరి ఎందుకభ్యంతరం చెపుతున్నారు?"

"దయచేసి నాకు కొంత వ్యవధివ్వు।"

"అలాగే" అని "ఈ ఫొటో తీసుకెళుతున్నాను. అభ్యంతరమా?" అడిగాడు.

"ఆమె గుర్తుగా మిగిలిందదొక్కటే బాబూ।"

"ఫర్వాలేదు....జాగ్రత్తగా రెండ్రోజుల్లో వాపసు చేస్తాను" అంటూ లేచి వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళటం వెళ్ళటం తిన్నగా హాస్టల్ కెళ్ళాడుసంజీవ్.

"కవిత అమ్మగారితో మాట్లాడావా?" ఆదుర్దాగా అడిగాడు ప్రభు.

"ప్రభూ। పెళ్ళంటే నూరేళ్ళ పంట....దానికి కొంచెం ముందూ వెనకా ఆలోచిస్తారు" పడక్కుర్చీలో తాపీగా కూర్చుంటూ అన్నాడు సంజీవ్.

ప్రభు దిక్కు మొహం వేయటం చూపిన సంజీవ్ మనసు చివుక్కుమంది. "ప్రభూ। ఈ సంజీవ్ రక్తనాళాల్లో రక్తం ప్రవహిస్తున్నంతవరకూ నీవు బెంగపడ నవసరంలేదు." సిగరెట్ అంటిస్తూ అన్నాడు సంజీవ్.

"సంజీవ్...."ఆర్ద్రమైన దృక్కులతోచూస్తూ సంజీవ్ చేతుల రెండూ పట్టుకున్నాడు ప్రభు.

"నీ కోసం నే నేదైనా త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డాను.... ఈ ఫొటో లోని వ్యక్తి చిత్రం ఫుల్ సైజులో గీయగలవా?"

"ఎవరిది ఈ ఫొటో?"

"కవిత అమ్మగారి స్నేహితురాలిదట"

"అవసరమా?"

"ఈమె అంటే ఆమెకు ప్రాణం.... కాల గర్భంలో కలిసిపోయిన ఈమెను కళ్ళెదుట నిలిపే శక్తి నీ చేతికుందని నిరూపించటానికి తీసుకొచ్చాను".

# 10

పర్సనల్ రూమ్‌లో కూర్చుని ఇన్‌కంటాక్స్ ఫైలు చూస్తున్న రావు గారు లోపలి కొచ్చిన కవిత తల్లిని చూసి ఆశ్చర్యపోయారు.

"ఏమిటిలా వచ్చావు?" ఆందోళనగా అడిగారు.

"రాకతప్పింది గాదు!"

"కవిత బాగుంది కదా?"

"బాగానే ఉంది కాని...." అంటూ నాన్చటంచూసి "ఏమైంది?" అనడిగారు రావుగారు.

"నిన్న సంజీవ్ మా యింటికొచ్చాడు!"

ఆ విషయం విన్న రావుగారి భృకుటి ముడి పడింది.

"నా కళ్ళముందు పుట్టిన సంజీవ్ పెళ్ళి పెద్దయ్యాడు."

"ప్రభుయేగా?" అడిగారు రావుగారు.

అవునన్నట్టు తలూపింది.

రావు గారి నోటినుండి వేడి నిట్టూర్పొకటి వెలువడింది.

"ఇరవై సంవత్సరాలుగా ఎంత తల్లడిల్లిపోతున్నానో నీ కర్థం గాదు. కళ్ళముందే కనిపిస్తున్నా నోరు తెరిచి చెప్పుకోలేని దుర దృష్టవంతుణ్ణయ్యాను. మమతల వంతెనని దాటలేని అవిటివాణ్ణ య్యాను. ఇహ ఆ విషయం దాచటం నా వల్లగాదు. రేపు వాడి పుట్టిన రోజు పండుగ నాడు అందరి ముందరా అసలు విషయం వెల్లడిచేస్తాను. 'ప్రభూ! నీవు అనాధవు గాదయ్యా' అని చెప్పేస్తాను" అంటున్న రావు గారి ముఖంలోకి విభ్రాంతిగా చూపిందామె.

* * *

పగలు అయినా దట్టంగా అలుముకున్న మేఘాలవల్ల చీకటి ఏర్పడింది. గాలి హోరు అధికమైంది. ఆ భయానక పరిస్థితిచూసి కాటోలు చెట్లు భయకంపితులై తలల్నాడిస్తున్నాయి. ఆ చెట్లకొమ్మల మీద కట్టుకున్న గూళ్ళు నేలగూలుతున్నాయి. పాపమా పక్షులు

హృదయ విదారకంగా విలపిస్తూ ఆకాశంలో తిరుగుతున్నాయి. ఉన్నట్లుండి జడివాన ప్రారంభమయింది. సౌందర్యారాధకుడైన సంజీవ్ ఆ చల్లనివేళ సిగరెట్ కాలుస్తూ బాల్కనీలో నిల్చుని ప్రకృతిలో జరుగుతున్న వింతల్ని చూస్తూ నిలబడ్డాడు. అంతలో చెట్టా పట్టాలు వేసుకుని పరుగెత్తుకొచ్చిన జంటని చూసి మెట్లు దిగసాగాడు.

ఆ వచ్చింది ఎవరోగాదు ప్రభు - కవిత. క్రిందకు అడుగు పెట్టిన సంజీవ్ దృష్టిలో వంగుని చీరకుచ్చెళ్ళు పిండుతున్న కవిత పడింది. ఆడవాళ్ళు తొడుక్కున్నది ఎంతటి హైట్ బ్లౌజు అయినా ముందుకు వంగినప్పుడు లూజవ్వక తప్పదు. అందునా మెడపట్టీ తగినంతగా కత్తిరించిన లోనెక్ జాకెట్ అయితే సరేసరి!!

ఆ పరిస్థితి చూడలేక కాబోలు తన ఉనికిని తెలియజేశాడు సంజీవ్.

"హలో! సంజీవ్....! అలా పార్కుకెళ్ళాం.... ఇంతలో వర్షమొచ్చింది" అన్నాడు ప్రభు.

"లోపలికిరండి" అంటూ పైకి దారితీశాడు సంజీవ్.

"చూడు కవితా! ఆ గదిలో టవలుంది.... కాస్తంత తల తుడుచుకో" అని "మనమా గదిలోకి పోదాంపద" అన్నాడు ప్రభు నుద్దేశించి సంజీవ్.

"నాన్నగారేరి?" అడిగాడు ప్రభు.

"బొంబే వెళ్ళారు."

"ఎప్పుడొస్తారు?"

"రెండ్రోజులు పట్టవచ్చు."

కుర్చీ చూపించి ఇలా అన్నాడు సంజీవ్. "కారు గ్యారేజ్‌లో ఉంది. వెంటనే వెళ్ళి ఆమెను ఇంటిదగ్గర డ్రాప్ చేసిరా!"

"ఇంత వర్షంలోనా.... అందునా ఏ చెట్టుకూలుతుందో, ఏ కొమ్మ విరిగిపడ్తుందో?"

"కావచ్చు. కాని పెళ్ళికాకముందే, ఒక వర్షపు రాత్రి కలిసున్నారంటే...."

"నామీద నీకా మాత్రం నమ్మకం లేదా?"

"ప్రభూ! ఇది నీకూ నాకు సంబంధించిన విషయం కాదు! కవిత అమ్మగారు ఎంత ఆందోళన పడ్తారో ఒక్కసారి ఆలోచించు"

ఆలోచనల్లో పడ్డాడు ప్రభు.

"సరే. తర్వాత ఆలోచిద్దాం.... ముందు వేడి వేడిగా ఏదైనా తీసుకుందురుగాని డైనింగ్ హాలులోకి పద" అని ప్రక్కన కవితున్న గదిలోకి ప్రవేశించాడు. పవిటను తెరచాపలా పట్టుకుని ఫ్యాన్‌గాలికి ఆరబెట్టుకుంటున్నది కవిత. అలా ఆమెను చూడగానే సంజీవ్ నరాలు జివ్వుమన్నాయి. తనను తాను కష్టంమీద విగ్రహించుకుని, సన్నగా దగ్గాడు. ఆమె పవిటను భుజాలనిండా కప్పుకున్నది.

"సారీ! ఇక్కడ చీరలేమీలేవు.... నాసైట్ గౌను ఇస్తాను. చీర మార్చుకోండి" అని, "త్వరగా డైనింగ్ హాలుకిరండి" అంటూ నైట్‌గౌనుని ప్రక్కనేఉన్న డబుల్‌కాట్ బెడ్‌మీదపెట్టి తిరుగు ముఖం పట్టాడు. తీవ్రంగా ఆలోచిస్తున్న సంజీవ్‌ని చూసి, "ఏమిట్రా, ఆలోచిస్తున్నావ్?" అడిగాడు ప్రభు.

"ఆమెకు అరెంజ్‌మెంట్సు ఎలా చెయ్యాలా అని"

"దానికెందుకింత వర్రీ అవుతావ్"

"లేదు ప్రభూ! యవ్వనమండే మంటలాంటిది. వళ్ళు దగ్గర పెట్టుకుంటే ఆ మంటలో వంటచేసుకోవచ్చు. అలక్ష్యంచేస్తే ఆ మంటే వంటిని కాల్చేస్తుంది."

అంతలో నైట్‌గౌను వేసుకుని వచ్చింది కవిత. నాయర్ వేడి వేడి బ్రెడ్ రోస్ట్ తెచ్చి వడ్డించాడు. బ్రెడ్‌తింటూ అప్రయత్నంగా ఆమె వైపు చూశాడు సంజీవ్. మధ్య పాపిటతీసి వెంట్రుకలు పైకిదువ్వి మధ్యలో రిబ్బను కట్టి వదిలేసింది. చటుక్కున కవిత తలెత్తటంతో దొరికిపోయిన దొంగలా తలదించేసుకున్నాడు సంజీవ్.

"మా అమ్మగారేమన్నారు?" పెళ్ళి విషయంలో కుతూహలాన్ని చూపించింది.

"కళ్యాణ మొచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు ...." అంటున్న సంజీవ్‌తో,

"మీరీ విషయాన్ని సీరియస్‌గా తీసుకోవటంలేదు!" అంది కవిత.

"అవి నీవనుకోవచ్చు.... కాని మీ అమ్మగార్ని అన మనండి" అన్నాడు సంజీవ్.

"హాట్ డ్రింకేమైనా తీసుకుంటారా?" అడిగాడు సంజీవ్.

"ఎలాగూ నేవిక భోజనం చేయలేను.... ఒక కప్పు పాలు త్రాగుతాను" అంది కవిత.

"రేపో మాపో పెళ్ళి కాబోతుండగా, ఇహ డైట్‌కంట్రోలు మానండి" పరాచిక మాడాడు సంజీవ్.

"నేనూ భోజనం చేయన్నా, పాలు త్రాగుతాను" అన్నాడు ప్రభు.

"తిండి దగ్గరా, వ్యవహారం దగ్గరా మొహమాటం పనికి రాదురోయ్!"

"అందుకే కదా వద్దనేది."

"బాబూ! మీకు పాలు తీసుకురమ్మంటారా?" అప్పటివరకు శ్రోతగా మిగిలిపోయిన నాయర్ అడిగాడు.

తలూపాడు సంజీవ్.

"ఇంతకీ నన్ను పంపిస్తున్నారా? లేదా...." అంటూ పాల గ్లాసందుకుంది కవిత.

"బయట బాగుండలేదుగా!" బేలగా అన్నాడు ప్రభు.

"ఒక పని చెయ్యండి! ఈ రాత్రికెలాగు బయటి కెల్లటం మంచిదికాదు. మీరు నాగదిలో పడుకోండి. మేమిద్దరం నాన్నగారి గదిలో పడుకుంటాం"

"అలాగే" అంగీకరించింది కవిత.

సరిగ్గా అదే సమయంలో....

"ఇన్సల్ట్...." గదిలో పచార్లు చేస్తున్న పిచ్చికవి అయిదో సారి అరిచాడు.

"నువ్వు సరిగ్గా చూశావా?" అడిగాడొక గొట్టాం బాబు.

"లాంగ్‌షాట్‌నుంచి కాదు.... షార్ట్ షాట్‌నుంచి చూశాను. కవితా, ప్రభు ఒకరి చేతులొకరు పట్టుకుని చిలకా గోరింకల్లా, పార్కులో...." అంటున్న మిత్రుడి మాటలను మధ్యలో త్రుంచుతూ,

"డామిట్.... నా చేగోడీలు తింటూ నా ముందరే నా కవిత గురించి.... నో....నో.... నే వినలేను" అరచినంత పనిచేశాడు పిచ్చికవి.

"ఇంతకీ తప్పంతా నీదేరా!" అన్నాడు ఓ మిత్రుడు.

ఉలిక్కిపడి చూశాడు. అంతలో ఏదో గుర్తుకొచ్చిన వాడిలా "నాదా?" అనడిగాడు.

"అవున్రా! ఇప్పటివరకూ నీ మనస్సులోని మాటని కవిత ముందుంచావా?"

"ప్రయత్నించాను....కాని ఫెయిలయ్యాను."

"ప్రొసీడ్....వెరీ అర్జంటు" అంటూ తెల్లకాగితాన్ని కవిగారి ముందుంచాడు ఒక ప్రబుద్ధుడు.

"ఏమని వ్రాయన్రా?"

"కవివి....నీకు మేము చెప్పాలా"

"అది కాదురా, ఆ విషయం విన్న తర్వాత బుర్ర మొద్దుబారి పోయింది."

"సరే చెప్తాను వ్రాయి" అంటూ డిక్టేట్ చేశాడు.

"దీనివల్ల ఫలితముంటుందంటావా?"

"నిస్సందేహంగా....వెంటనే కవిత అడ్రస్‌కి పోస్టు చెయ్యి"

"అలాగే" అంటూ అడ్రస్ రాశాడు.

"నాదో చిన్న సలహారా..." మొద్దబ్బాయి అందుకున్నాడు.

"ఏమిట్రా?" ఆశగా అడిగాడు కవి.

"సినిమాలో హీరో విలన్ని దబ దబా బాదేసి హీరోయిన్ ముందు తన హీరోయిజాన్ని ప్రదర్శిస్తాడు అలాగే..."

"ఏం చేయమంటావురా?" ఆశగా అడిగాడు.

"కవిత కళ్ళముందే ప్రభుని బాదెయ్యి"

"నేనే" అర్జంటుగా బట్టతల తడుముకుంటూ అన్నాడు.

"బ్రిలియంట్ ఐడియా. పెద్దబ్బాయి" నాలుగు గొంతులు వంతపలికాయి.

"అమ్మోవాడు నన్ను కోడిపెట్టని విరిచినట్లు విరిచేస్తాడు"

"'పిస్తోలుపిల్ల' చిత్రంలో ఒక ఆడది దున్నపోతుల్లాంటి పాతిక మంది మగవాళ్ళతో ఫైటింగ్ చేస్తుంది. నువ్వు ఆఫ్టరాల్ ఒక హిప్పీ గాడ్ని కొట్టాలేవా? ఛ! నీకు కవిత కావాలా?"

"అలా అనకు గురూ. కవితకోసం వాడి పీకైనా కోస్తాను"
"దట్స్ గుడ్." అంటూ రేపటి కార్యక్రమాన్ని నిర్ణయించే సింది మిత్రబృందం.

* * *

తూర్పున తెల్లవారుతుంది...

కళ్ళుతెరచిన సంజీవ్‌కి ఆదమర్చి నిద్రబోతున్న ప్రభు కని పించాడు. అలవాటు ప్రకారం లేచాడు. అప్పుడుగాని తాము పడు కున్నది తండ్రిగారి గదిలో నన్న సంగతి స్ఫురణకు రాలేదు. టూత్ బ్రష్ తెచ్చుకుందామన్న ఉద్దేశ్యంతో మెల్లగా లేచి తనగది తలుపు తెరిచాడు. చెదిరిపోయిన నైట్ డ్రస్‌తో అస్తవ్యస్తంగా పడుకునున్న కవిత కని పించింది. వెంటనే తిరుగు ముఖం పట్టాడు. "ప్రభూ!" అంటూ నిద్రబోతున్న వాడ్ని లేపి. "వద్దు అన్నకొద్దీ ఆమెను ఇక్కడే ఉంచే వావ్! చూడు ఇప్పుడు నాకు టూత్ బ్రష్, పేస్టుకావాలి" అన్నాడు.

"తీసుకొస్తానుండు" అంటూ వెళ్ళిన ప్రభు అయిదు నిమిషా లకు గాని రాలేదు. అవి తీసికొని గదికి అటాచ్ చేస్తున్న బాత్‌రూమ్‌లో కెళ్ళాడు సంజీవ్.

కాల చక్రంలో మరో రెండు గంటలు గడిచాయి.

"నాన్నగారు బొంబే ఎందుకెళ్ళారు?" అడిగాడు ప్రభు.

"మెషినరీ ఏదో..." అని చెప్పబోతున్న వాడల్లా ఫోన్ మ్రోగటం విని "జస్ట్ ఎ మినిట్" అంటూ రిసీవర్ ఎత్తాడు.

"యస్, సంజీవ్ స్పీకింగ్...."

"............"

"వాట్!"

"............"

"అలాగే. పావుగంటలో వచ్చేస్తున్నాను." ఫోను పెట్టేసి అన్యా మనస్కంగా బయటకు నడిచాడు.

"బాబూగారు! బ్రేక్‌ఫాస్ట్ ఆరేంజ్ చేయమంటారా?" నాయక్ ప్రశ్న.

"త్వరగా ఫ్యాక్టరీ కెళ్ళాలి...క్విక్"

"తమరు స్నానం చేయ్యలేదను కుంటాను"

"మర్చేపోయాను" అంటూ వడివడిగా అడుగులేస్తూ తన గదిలోకి ప్రవేశించాడు. అనాలోచితంగా బాత్రూమ్ డోర్‌లాక్ బటన్ నొక్కి లోపలికి చూశాడు. కవితుంది!

అంతే!!

వెంటనే డోర్ వేసి బయటకు నడిచాడు.

డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్న సంజీవ్‌ని ప్రశ్నార్థకంగా చూస్తూ బాయిల్డ్ ఎగ్, బ్రెడ్‌స్లైసెస్ తెచ్చి ముందుంచాడు నాయర్.

ఉద్రేకానికి సూచనగా తెల్లని సంజీవ్ ముఖం ఎర్రగా జేవురించింది. పిచ్చిగా బ్రెడ్‌స్లైసెస్ తృంచి పోస్తున్న సంజీవ్‌ని సమీపించి అతని పరాకుగల కారణం అడిగాడు ప్రభు.

"నీవు త్వరగా పెళ్ళిచేసుకో"

తన పెళ్ళికి, అతని పరాకుకి గల సంబంధమేమిటో బోధపడక చూస్తుండిపోయాడు ప్రభు.

"ఫ్యాక్టరీకి వెళ్తున్నాను. ఒక గంటలో తిరిగి వచ్చేస్తాను. కాలేజీకి వెళ్దాంరా. రెడీగా ఉండండి." చెప్పవలసిన దాన్ని మూడు ముక్కల్లో చెప్పేసి చరచారా వెళ్ళిపోయాడు సంజీవ్.

మెల్లగాలేచి కవిత గదివైపు అడుగులేశాడు ప్రభు. గులాబీ రంగు చీర, అదేరంగు బ్లౌజ్ వేసుకుని, డ్రస్సింగ్ టేబుల్ దగ్గర కూర్చుని తలదువ్వుకుంటున్న కవిత చప్పుడయినట్లుంటే వెనుదిరిగి చూసింది. ద్వారం దగ్గరే నిల్చుని కాంతులీనే కళ్ళతో తృప్తిగా చూస్తున్న ప్రభు కన్పించాడు. ఏ భాషావ్యక్తం చేయలేని భావాల్ని ఆ కళ్ళు వ్యక్తం చేస్తున్నాయి. కవిత మెల్లగా నవ్వింది.

"అందం సొత్తు యావత్తు స్త్రీ సొంతం కావటం సృష్టిలీల కదూ!" ఆమెను సమీపించాడు ప్రభు.

"పదహారు వన్నె బంగారం కూడ సానపట్టనిదే అతకదు. స్త్రీ అందాన్ని ఆస్వాదించే పురుషుడు లేని రోజున ఆ అందానికి విలువ లేదు" అంది కవిత.

ప్రభు మెల్లగా ఆమెను సమీపించి ఆమె పెదవుల్ని తన పెదవులతో తాకాడు. ఆమె బాహువులు అతన్ని పెనవేశాయి. ఎక్కడో

దూరాన వింగి నేలా ముద్దుపెట్టు కుంటున్నాయి. వారు పరిసరాల్నే మర్చిపోయి కాలానికి కళ్ళెం వేశారు. అలా ఎంతసేపున్నారో కాని మధ్యలో నాయర్ రావటంతో ఆ కౌగిలి విడిపోక తప్పలేదు. డైనింగ్ హాల్ చేరుకున్నారు. అంతలో వచ్చాడు సంజీవ్.

వస్తూనే, "దారిలో మీ అమ్మగారు కనిపించారు కవితా! సమాధానం చెప్పానులే" అని గదిలోకి దారితీశాడు.

మరో అరగంటలో ముగ్గురూ కార్లో కాలేజీకి బయలుదేరారు. లైబ్రరీ ఎంట్రెన్స్ దగ్గర కారాపి, "దిగండి....నేను కారుపార్కు చేసివస్తా" అన్నాడు సంజీవ్. కారుదిగారు ప్రభు, కవితలు.

సరిగ్గా అదే సమయంలో........

లైబ్రరీ దగ్గరున్న చెట్టుక్రింద చేరిన గణపతిశాస్త్రి మిత్ర బృందం, కారు దిగిన కవితని, ప్రభుని చూడగానే కళ్ళతోనే కూడ బలుక్కున్నారు.

"శాస్త్రీ! ఇదే మంచి సమయం...." అన్నాడు పెద్దబ్బాయి.

"ఎ....ఎ....లా?"

"ఏదో వంకమీద తగదాపెట్టుకో....ఆపైన మేమున్నాం." భరోసా ఇచ్చాడు.

"జై వీరహనుమాన్!" అనుకుంటూ, 'లబ్....డబ్' మని కొట్టుకుంటున్న గుండె ఎక్కడ ఆగిపోతుందోనని అతి జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకు నడిచాడు పిచ్చికవి.

"విష్ యు గుడ్‌లక్!" ఎవరో వెనక కేకపెట్టాడు.

వణుకుతున్న చేతితో అతికష్టంమీద వెనకగా వెళ్ళి ప్రభు కాలర్ పట్టుకున్నాడు. వెనుకకు తిరిగిన ప్రభు "హల్లో, శాస్త్రీ!" అంటూ విష్ చేశాడు.

లాగి చెంపమీద చరిచాడు గణపతిశాస్త్రి.

బిత్తరపోయి చూశారు ప్రభు, కవితలు.

తిరిగి గాలిలోకి లేచిన శాస్త్రి చేతిని చూచి, తేరుకున్న ప్రభు చేతిని గాలిలోనే పట్టుకుని ఎడాపెడా చెంపలు రెండూ వాయించాడు. అప్పుడే వచ్చిన సంజీవ్ ఆ పరిస్థితిని చూసి ఆశ్చర్యపోయాడు. ఇద్దర్నీ రెండు చేతులతో పట్టుకుంటూ, "ఏమయింది?" అనడిగాడు.

సంజీవ్ రంగప్రవేశం చేయటంతో పిచ్చికవిగారికి మిత్రు లెవరూ సహాయం రాలేదు.

"ఒరేయ్! తల్లీ తండ్రిలేని గాలి వెధవా! ఒక్కడ్నిచేసి కొట్టావా! నీ ప్రాణాలు తీయకపోతే నాపేరు గణపతిశాస్త్రికాదు." ఉక్రోషంతో అంటూ క్యాంటీన్ వైపు నడిచాడు శాస్త్రి.

శాస్త్రిదెబ్బ శరీరానికి తగిలుండవచ్చు. కాని అతని మాటలు మాత్రం ములుకుల్లా ప్రభు హృదయంలో గ్రుచ్చు కున్నాయి.

అంతలో కాలేజీ బెల్ మ్రోగటంతో క్లాస్‌రూమ్ వైపు నడవక తప్పలేదు. పిచ్చికవి ద్వారా జరిగింది విన్న నాగరాజు అగ్గిమీద గుగ్గిల మయ్యాడు. "దాని బొమ్మ బోర్డుమీద గీస్తాను. ఎవడు అడ్డమొస్తాడో చూస్తాను." అని ఆవేశంతో క్లాసురూమ్‌లో ప్రవేశించాడు. సుద్ద ముక్కతో బ్లాక్‌బోర్డుమీద నగ్న స్త్రీ చిత్రాన్ని గీసి క్రింద 'కవిత' అని వ్రాశాడు నాగరాజు.

అది చూసిన ప్రభు హృదయం భగ్గుమన్నది. కోపంతో నాగరాజు దగ్గరకు పరుగెత్తుకెళ్ళి జుట్టు పట్టుకున్నాడు. ఈ హఠా త్పరిణామానికి నివ్వెరపోయిన సంజీవ్ అంతలోనే తేరుకొని వెంటనే వెళ్ళి నాగరాజుని రెండు చేతులతోనూ పట్టుకున్నాడు. చేతి సత్తానంతా నాగరాజు దవడలమీద చూపించాడు. ప్రభు.

"ఒరేయ్! మీ ఇద్దరి ప్రాణాలు తీయకపోతే నా పేరు నాగరాజే కాదు" అని నాగరాజు అరుస్తున్నంతలో. ఈ గందరగోళం విన్న ప్రిన్సిపాల్ పరుగెత్తు కొచ్చాడు. ఫలితంగా నాగరాజు పాతిక రూపా యల ఫైన్ కట్టవలసి వచ్చింది.

"ప్లీజ్ సంజీవ్! క్లాసులో కూర్చోలేను. దయచేసి నన్ను మీ యింటికి తీసుకుపో" అన్నాడు ప్రభు. ఏమనుకున్నాడో ఏమో గాని, "అలాగేపద...." అంటూ బయటకు నడిచాడు సంజీవ్. క్లాసునుంచి వెళ్ళిపోతున్న ప్రభు, సంజీవ్‌లను అనుసరించింది కవిత.

"ఏం? నువ్వూ వచ్చేస్తున్నావా?" ఇగ్నిషన్ కీ త్రిప్పుతూ అడిగాడు సంజీవ్. తలూపింది కవిత.

కారు బయలుదేరింది.

మరికొద్ది సేపట్లో కారు రావుగారి భవనం ముందాగింది.

"ప్రభూ! నీవు నాగదిలో రెస్టు తీసుకో... నేను కవితని డ్రాప్‌చేసి వస్తాను." అన్నాడు సంజీవ్.

ప్రభు తలూపి కారుదిగాడు.

తిరిగి కారు కవిత యింటిముందాగే వరకూ పెదవులు విప్పలేక పోయింది కవిత.

"లోపలికి రండి." ఇంటితాళం తీస్తూ ఆహ్వానించింది సంజీవ్‌ను. తలుపులు తెరచిన కవితని కవరొకటి ఆహ్వానించింది. వచ్చిన ఉత్తరాల్ని రెండు తలుపుల మధ్యగుండా లోపలికి వేయటం పోస్టుమాన్‌కి అలవాటు.

""కూర్చోండి." మంచం చూపించి కవరు చించింది.

అది పిచ్చికవి, కవితకి వ్రాసిన ప్రేమలేఖ.

"కవితా!

నీవే నా జీవిత సర్వస్వానివి. నీవులేని నా జీవితం చేపలులేని చెరువు. నీపేరు కవిత. నా కవితా సామ్రాజ్యానికి మహారాణివి. నీవు లేనిదే నేను బ్రతకలేను. నీ కోసం ప్రాణాల్నయినా ఇవ్వటానికి సిద్ధంగా వున్నాను.

నా అభ్యర్ధనను కాదనవని ఆశిస్తూ...

ఎన్నటికీ నీవాడు కావాలని కోరుకునే

—గణపతిశాస్త్రి"

లెటరు చదివి సంజీవ్ చేతికిచ్చింది.

చదివి. "ఇదన్నమాట ఈరోజు తగాదాకి అసలు కారణం!" లెటరు జేబులో పెట్టుకుంటూ అన్నాడు.

మూగగా కూర్చున్నది కవిత.

"ఏది ఏమైనా మీ పెళ్ళి త్వరగా జరిగిపోతేనే బాగుణ్ణు!" అంటూ సిగరెట్ వెలిగించాడు. రెండు క్షణాలాగి-

"మీ అమ్మ ఏమంది?" అనడిగాడు సంజీవ్. కవితనుండి జవాబు రాక పోవటంతో, "ఐ విల్ సెటిల్ ది మేటర్ టుడే" అంటూ "త్వరలో మీ పెళ్ళి జరిగే ఏర్పాటు చేస్తాను" అన్నాడు గంభీరంగా.

"థ్యాంక్స్." అంది కవిత.

"ఇట్ ఈజ్ మైడ్యూటీ" అంటూ లేచి, "మీ మదర్ దగ్గర కెళతాను." అని కారు వైపు నడిచాడు సంజీవ్.

# 11

ఉదయం జరిగిన సంఘటనని మర్చిపోవాలని ఒంటరిగా మిగిలిపోయాడు ప్రభు. కాని ఏ విషయాన్ని మర్చిపోవాలనుకున్నాడో అదే విషయం పదే పదే మస్తిష్కంలో మెదిలింది.

"భగవంతుడా! నాకీ జన్మనెందుకు ప్రసాదించావ్?" ఆక్రోశించిందా సున్నితపు మనస్సు. సరిగ్గా అదే సమయంలో, "కవిత అమ్మగారు మీ పెళ్ళికి అంగీకరించింది....ఇహ ముహూర్తం పెట్టడమే ఆలస్యం" అంటూ వచ్చాడు సంజీవ్.

"నాకా...పెళ్ళా!" విరక్తిగా నవ్వాడు ప్రభు.

"అవును....నీ కోరిక కార్యరూపాన్ని ధరించబోతుంది."

"సంజీవ్! పెళ్ళిదగ్గర నీ పేరేమిటి? నీ తల్లెవరు- తండ్రెవరు? నీ కులమేమిటి- గోత్రమేమిటి? అనడుగుతారు కదూ!"

"..........."

"ఏమని చెప్పనురా? తల్లెవరో, తండ్రెవరో తెలియని అనామకుడ్ని....కులం, గోత్రంలేని భ్రష్టుడ్ని అని చెప్పనా!"

"ప్రభూ...."

"అవున్రా....ఈ వేళ శాస్త్రి 'తల్లీతండ్రీ లేని గాలివెధవా!' అని పిల్చాడు. రేపు పెళ్ళి పందిట్లో యావన్మందీ 'పెళ్ళి కొడుక్కా' నా అన్నవారు లేరట-అని గుసగుసలాడుతుంటే 'తగుదునమ్మా' అంటూ పెళ్ళిపీటల మీద కూర్చోనా?" ప్రభు కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ప్రభూ! ఏమైందిరా నీకు? ఎందుకిలా మాట్లాడుతున్నావ్?"

"సంజీవ్! మన బ్రతుకులు పంచదార పూతపేసిన చేదు మాత్రలురా....పైకెంత తియ్యగా ఉంటాయో, లోపలంత చేదుగా వుంటాయి. నాగుండెల్లో బ్రద్ధలవుతున్న అగ్నిపర్వతాలు నీ కర్థంగావు"

"............"

"దయచేసి ఈ పెళ్ళి ప్రయత్నాలు మాన్పించు."

"లేదు. వచ్చే ఆదివారం దండలపెళ్ళి జరుగుతుంది."

'సంజీవ్....!"

"పెళ్ళికి స్నేహితులంతా వస్తారు, కాని పెళ్ళికి ఆయిదు నిమిషాల ముందు మాత్రమే వాళ్ళకి విషయం తెలుస్తుంది. అప్పటివరకూ నీకు, నాకు, కవితకు, కవిత అమ్మగారికి తప్ప మరో వ్యక్తికి తెలియటానికి వీల్లేదు" సిగార్ లైటర్ వెలిగెంచి సిగరెట్ అంటిస్తూ అన్నాడు సంజీవ్.

* * *

కారు పోర్టికోలో ఆగింది. ఘూర్ఖా వచ్చి వినయంగా కారుడోర్ తెరచి పట్టుకోగా కారు దిగారు రావుగారు. సూట్ కేస్ చేతబట్టుకుని ఆయన్నుఅనుసరించాడు డ్రైవరు. హాలులోకి అడుగుపెట్టిన రావుగారి దృష్టి గోడకు అమర్చిఉన్న ఫుల్ సైజు కలర్ ఫొటోపై పడింది. ఆ ఫోటోని చూడగానే హృదయాన్ని ఛేదిస్తూ, మనస్సుని శిధిలపరుస్తూ క్షోభ, ఆవేదన ఆయన్లో జనించాయి. "ఎడతెగని చీకటి వర్షము కురుస్తుందా!" అన్నట్లుగా ఆయన్ని చీకటి ఆవరించింది. "శతకోటి సూర్యులు భూమికి దిగివస్తున్నారా!" అన్నట్టుగా చీకట్లో ఒకే ఒక కాంతి పుంజము కనిపించింది. ఆ కాంతి పుంజము ఒక స్త్రీమూర్తిగా రూపుని సంతరించుకుంది.

"జానకీ...." గావుకేకపెడ్తూ బిక్కబిటుగా నేలకూలుతున్న రావుగార్ని నేలవాలకుండా పట్టుకున్నాడు వెనక వస్తున్న డ్రైవరు.

టేప్‌రికార్డర్ వింటున్న సంజీవ్, అస్పష్టమైన ఆ గావుకేకకి తృళ్ళిపడి ఒక్క ఉదుటున క్రిందకు దిగాడు. అపస్మారక స్థితిలో పడున్న తండ్రిని చూడగానే డాక్టరుకి ఫోనుచేశాడు.

మరో పదినిమిషాల్లో ఆవరణంతా కార్లమయమయింది. ఎవరెవరో వస్తున్నారు. ఏదేదో పరామర్శ - అందరికీ అన్యమనస్కంగానే సమాధానమిస్తున్నాడు సంజీవ్.

ఆ షాక్‌నుంచి రెండురోజులకుగాని రావుగారు కోలుకోలేదు. చల్లని చెయ్యి ఫాలభాగాన్ని తాకినట్లుండగా కళ్ళు తెరిచాడు రావుగారు.

బెడ్ ప్రక్కనే కుర్చీలో కూర్చున్న వ్యక్తినిచూసి, "నువ్వు...! ఇక్కడా?" ఆదుర్దాగా అన్నారు.

"నేను సంజీవ్ స్నేహితురాలు కవిత తల్లిగా వచ్చాను"

"సంజీవ్ ఎక్కడ?"

"ప్రభు, సంజీవ్, కవిత లాన్లో కూర్చుని మాట్లాడుతున్నారు"

"జానకి చిత్రం ఈ ఇంటికెలా వచ్చింది"

"ప్రభు చిత్రకారుడు"

"వాడికా విషయం తెలిసిందా?"

"అతనికా అదృష్టం ఇంకా కలగలేదు"

"కోరి అశ్రద్ధచేసిందే తరువాత కరువై దుఃఖకారణం అవుతుంది." అంది, ఆమె వేడి కన్నీరు ఆయన చెక్కిళ్ళమీదగా జారి పడాయి.

"పున్నమి దాటితే చందమామ చీకట్లోకి జారిపోతుంది."

అర్థంగాక చూశారాయన.

"ఎల్లుండి ఆదివారంనాడు ప్రభు, కవితలపెళ్ళి"

రావుగారి భృకుటి ముడివడింది.

"హోటల్ నాగినీ రూఫ్ గార్డన్‌లో దండల పెళ్ళి"

"అసంభవం...."

"పరిస్థితి చేయి జారిపోయింది"

"ఇంకా నేను బ్రతికే ఉన్నాను"

అంతలో ఎవరోవస్తున్న అడుగుల సవ్వడి వినరావటంతో సంభాషణ మారిపోయింది.

* * *

"ఏమిట్రా ఈకార్డ్?" అడిగాడొక గొట్టాంఫాంటు.

"ఆదివారం ఉదయం పదిగంటలకు 'హోటల్ నాగిని'లో పార్టీ ఇస్తున్నా" అంటూ సంజీవ్ సమాధానమిచ్చాడు.

"పుట్టినరోజా?" మరొక బాబ్డ్‌హెయిర్ అమ్మాయి ప్రశ్న.

"నో....చిన్నపాపాయిలా పుట్టినరోజు పండుగలేమిటి?"

"మరి?"

"సస్పెన్స్.... ముందే చెప్పేస్తే మజాలేదు."

"ఇంతకీ వెట్ పార్టీ ఉందా—లేదా?" మరో కొంటె కుర్రవాడి ప్రశ్న.

"ఉంది" అన్నాడు సంజీవ్.

"థాంక్యూ"

"కాని హాస్టలులోని ఒక్కడు కూడా ఆబ్సెంట్ అవటానికి వీలులేదు" అన్నాడు సంజీవ్.

"ష్యూర్....ష్యూర్" ఒక్కసారిగా పలికాయి అక్కడున్న గొంతులు.

మిగతా కార్డ్సు పంచిపెట్టడానికి కెళ్ళాడు సంజీవ్.

# 12

ఎదురు చూసిన ఆదివారం రానే వచ్చింది.

ఎనిమిది గంటలకల్లా ముస్తాబయ్యాడు సంజీవ్. కాని ఎర్ర బారిన ఆ కళ్ళని, జేవురించిన ఆ ముఖాన్ని చూసి, "ఏ విషయం గురించి తీవ్ర సంఘర్షణని ఎదుర్కొంటున్నాడో!" అనుకున్నారు రావుగారు.

స్టెప్స్ దిగుతున్న వాడ్ని పిలిచి అన్నారు, "బాబూ! మన ఫ్యాక్టరీని చూడటానికి ఫారిన్ ఎక్స్‌పర్ట్స్ వస్తున్నారు. నేను లేచే స్థితిలో లేను. మన కంపెనీ తాలూకు మెయిన్ స్టాఫ్ అంతా ఏరో డ్రోమ్ దగ్గరే ఉంటుంది. సరిగ్గా తొమ్మిది గంటలకి ప్లేన్ ల్యాండవు తుంది. స్వాగత సన్మానాలుంటాయి. అందువల్ల నీవు ఎనిమిదిన్నర కల్లా అక్కడుండు"

"డాడీ! అప్పుడే ఎనిమిది పదయింది"

"అయితే త్వరగా వెళ్ళు"

నిట్టూరుస్తూ వెళ్ళాడు సంజీవ్

సంజీవ్ కనుమరుగవ్వగానే మెల్లగాలేచి కారుని హాస్టల్ వైపు దారి పట్టించారు రావుగారు. సరిగ్గా అదే సమయంలో—

హాస్టల్ బోయ్‌తోసహా అందరూ పార్టీకి వెళ్ళటం చూసిన పిచ్చికవి గుండెలు తరుక్కుపోయాయి. తన పాపులారిటీని దెబ్బ తీయటానికే సంజీవ్ ఈ పార్టీని అరెంజ్‌చేశాడని తలపోశాడు. నాగ రాజుకి కూడా అంత పెద్ద పార్టీకి 'వెళ్ళలేక పోతున్నానే!' అన్న బాధున్నా, మొన్న ఏ వ్యక్తయితే పట్టుకుని కొట్టించాడో అదే వ్యక్తి ఇస్తున్న పార్టీకి వెళ్ళడానికి మనసొప్పలేదు. కాని బితుక్కు బితుక్కు మంటున్న ఆ హాస్టల్‌లో ఉండలేకపోయాడు. అందుకే పిచ్చికవి వెంట సినిమాకి బయలుదేరాడు.

"ప్రభుగాడు పార్టీ కెళ్ళినట్లులేదే!" హాస్టల్ కాంపౌండుదాటుతూ అడిగాడు నాగరాజు

"స్నానం చేస్తున్నాడు.... వీడికోసం స్పెషల్‌గా కారొస్తుంది కాబోలు" సమాధాన మిచ్చాడు పిచ్చికవి.

నిజంగానే వేసుకున్న పథకం ప్రకారం సంజీవ్ కారు తీసు కుని తొమ్మిది గంటలకల్లారావాలి.

ఆ కార్లో ప్రభు హోటల్ కెళ్లాలి. అందుకే సంజీవ్ కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు ప్రభు.

కాని ఏరోడ్రోమ్‌కి వెళ్ళిన సంజీవ్ పదిగంటలవుతుండగా గెస్ట్ హౌస్ నుంచి తిన్నగా హోటల్ చేరాడు.

"ఏం బాబూ! హోస్ట్‌వి మాకన్నా వెనకా వచ్చేది!" అడిగారు మిత్రులు.

"నేను రాకపోతేనేం? పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకు వచ్చా రుగా!"

"ఎవరు వాళ్ళు?" ఆశ్చర్యంగా అడిగారు.

చెప్పాడు సంజీవ్.

"ఇంకా ప్రభు రాలేదు" ఎవరో అన్నారు.

"ఓ....నేను వస్తానని ఎదురుచూస్తూ ఉండి ఉంటాడు." అనుకుంటూ మరో ఇద్దర్ని వెంటబెట్టుకుని కార్లో హాస్టల్‌కి బయలు దేరాడు సంజీవ్.

కారు పార్కుచేసి కొంచెం వెనకగా వస్తున్న సంజీవ్, ముందు వెళ్ళి ప్రభు గది తెరిచిన వ్యక్తి గావుకేక పెట్టడంతో ఒక్క ఉదటున

పరిగెత్తికెళ్ళి లోపలికి తొంగి చూసి బొమ్మలా నిలిచిపోయాడు. కాసేపట్లో పోలీసులొచ్చారు. ప్రభ హత్య చేయబడ్డాదని నిర్ణయించి, అనుమానం మీద పిచ్చికనివి, నాగరాజుని అరెస్టుచేసి తీసుకెళ్లారు.

* * *

ప్రభ మరణం రావుగారి జీవితంలో అనూహ్యమైన మార్పు తెచ్చింది. కొడి గట్టిన దీపపు వత్తివలె, కంకులు రాల్చిన వరి మొక్కవలె, కళా విహీనమైన వదనంతో శూన్యంలోకి చూస్తూ కూర్చున్న తండ్రిని చూడగానే సంజీవ్ హృదయం కలిచివేయ బడింది. తండ్రిని పలకరించే ధైర్యం లేక, అలాగని తండ్రిని ఆ స్థితిలో వదిలి వెళ్ళలేక, సతమతమయ్యాడు. చివరకు అతికష్టం మీద 'నాన్నా!' అని పిలిచాడు.

తల త్రిప్పి చూశారాయన.

"మీరెందుకిలా అయిపోతున్నారో నాకర్థం గావటం లేదు."

"సంజీవ్! తన పిల్లల ప్రేమ భాష్పాలకై ఆ కన్న హృదయం ఎంత తల్లడిల్లుతుందో నీకర్థంగాదయ్యా!"

"మీరనేది నాకర్థం గావటంలేదు!"

"కన్ను తెరిస్తే జననం-కన్ను మూస్తే మరణం. రెప్పపాటే బాబూ ఈ ప్రపంచం." అంటున్న రావుగారి కళ్ళ నుండి వేడి కన్నీరు బొటబొటా కారింది.

"డాడీ! దయచేసి మీరు ఏదీ ఆలోచించకండి....విశ్రాంతి తీసుకోండి."

"నాకు...! విశ్రాంతి! ఈ బొందిలోనుంచి ప్రాణం పోయిన నాడు గాని విశ్రాంతి దొరకదు బాబూ!"

"ఈ మాత్ర వేసుకుని, కళ్ళు మూసుకు పడుకోండి" నిద్ర మాత్ర లందించాడు సంజీవ్.

"మమతానుబంధాలు క్షణాలని తెలిసే ఆశలు పెంచుకున్నా నయ్యా! అందుకే నాకీ శిక్ష!" అంటూ రెండు మాత్రలు వేసుకుని నీళ్ళు త్రాగారు రావుగారు.

క్రమంగా నిద్రలోకి జారిపోయారు. కాని ఆ నిద్రలోనూ ఏవేవో కలవరింతలు. వెర్రి కేకలు. ఆ కలవరింతల్లో ఎవరెవరి పేర్లో

దొర్లుతున్నాయి. అలా ఆయన ఎప్పుడూ నిద్ర మాత్రలు మ్రింగి అపస్మారక స్థితిలోపడి ఉంటుండటంవల్ల ఫ్యాక్టరీ నిర్వహణ బాధ్యత సంజీవ్‌కి తప్పలేదు.

# 13

కళాశాల జీవితమే కల్లోలితమైపోయింది. పత్రికలన్నీ ఈ విషయానికి ప్రాముఖ్యతనిచ్చాయి. పోలీసుల అన్వేషణలు ప్రారంభ మయ్యాయి. భయపడ్డ విద్యార్థులు చాలమంది కాలేజీకి రావటమే మానేశారు. మరికొందరు హాస్టల్ ఖాళీచేశారు. ఆవేళ హాస్టల్‌లో విద్యా ర్థుల్లో పార్టీకి రానివారు ఇద్దరే ఇద్దరు. ఒకరు నాగరాజు, రెండు గణ పతిశాస్త్రి, ఈ సంఘటనకిముందు నాగరాజు, ప్రభ ఘర్షణ పడ్డారు. నాగరాజు కట్టిన పాతిక రూపాయల ఫైన్ ఇందుకు సాక్ష్యంగా నిలి చింది. అదీగాక అందరిముందే అతడు ప్రభుని చంపుతానని బెది రించాడు. అందువల్ల అతన్ని కస్టడీలోకి తీసుకున్నారు. ఆ సమయంలో తాము సినిమాహాల్లో ఉన్నామని నాగరాజు అన్నా, వినిపించుకున్న నాధుడే లేడు.

ఇహ పిచ్చికవి-అతడు కవితకి వ్రాసిన లేఖని సంజీవ్ బయట పెట్టడంతో అది సాక్ష్యాధారమయింది.

'నీకోసం ప్రాణాల్నయినా ఇవ్వటానికి సిద్ధంగా వున్నాను.' అని వ్రాశాడు.

ఈ హత్య పెళ్ళికి కొద్ది గంటలముందే జరిగి ఉండటంతో పిచ్చికవే చేసుండవచ్చని అనుమానం.

"బాబోయ్! నాకంత ధైర్యంలేదు....ఆవేళ వీరంతా తన్న మంటే వెళ్ళి తన్నులు తిన్నాను.....వీరు వ్రాయమంటేనే ఆలేఖ కూడా వ్రాశాను. అదీ నా సొంతముకాదు. బాబోయ్. అసలు నేను కవినే గాదు. వీక్లీలో శాస్త్రి అన్న పేరుతో వ్రాసింది నేనుకాదు. తమాషాకి నేను వ్రాశానని చెప్పుకున్నాను. నాకీ ప్రేమావద్దు-పెడాకులూవద్దురో

దేవుడా! నేను లేనిదే అమ్మ బ్రతకదురోయ్ భగవంతుడా!" అంటూ కన్నీరు మున్నీరుగా గోడుగోడున విలపించాడు పిచ్చికవి ఉరఫ్ గణపతి శాస్త్రి. కాని అతడిగోడుని ఆలకించిన వారేలేరు.

* * *

చెక్ మీద సంతకం పెట్టి అలసటగా ఒళ్ళు విరుచుకున్నాడు సంజీవ్. గోడగడియారం ఏడు గంటలు కొట్టింది.

"బాబూ! సంతకాలయ్యాయా!" లోపలికొస్తూ అడిగాడు మేనేజర్.

"అయిపోయాయి....రేపే అందరికీ పేమెంట్సు ఇచ్చేయ్యండి"

"అలాగే" అంటూ చెక్ బుక్ అందుకుని నిష్క్రమించాడు మేనేజర్.

ఎదురుగానున్న తల్లి ఫొటో కన్పించింది...."అమ్మా! నీ పేరుతో నాన్నగారు ఇంత పెద్ద ఫ్యాక్టరీ పెట్టారు. దీని అజమాయిషీ బాధ్యత నాకప్పగించారు. నాకాశక్తిని ప్రసాదించమ్మా!" చేతులు రెండూ జోడించాడు.

మెల్లగా బయటకు నడిచాడు. "రఘునాథరావు" అని ఎంతో చక్కగా చెక్కిన తండ్రి నేమ్ బోర్డు కనిపించింది.

"డాడీ! అందరూ నిన్ను రావుగారంటారేగాని నీ పూర్తి పేరు ఎంత మందికి తెలుసు!" అనుకుంటూ కారు దగ్గరకు నడిచాడు సంజీవ్.

ఇగ్నీషన్ 'కీ' త్రిప్పుతున్న సంజీవ్ మదిలో కవిత మెదిలింది. వెంటనే కవిత వాళ్ళింటివైపు కారుని మళ్ళించాడు. మరో పది నిమిషాల్లో కారు గమ్యం చేరింది. పాడుబడ్డ ఇల్లులా కళాకాంతులు లేక వెలవెల బోతుంది. నిశ్శబ్దమే నోరు విప్పుతున్నట్లుంది అక్కడ.

"ఎవరూ లేరా!" అనుకుంటూ దగ్గర వేసిన తలుపుల్ని నెట్టాడు. అంతా చీకటి!

జేబులోని సిగార్ లైటర్ వెలిగించి, ఆ వెలుగులో లైట్ స్విచ్ ఆన్ చేశాడు. కాంతి గదంతా పరుచుకుంది.

మూలగా కటిక నేలమీద పడుకున్న కవిత ఆ వెలుగుకి కాటోలు భారంగా కనురెప్పలెత్తింది.

"కవితా!"

"ప్లీజ్, లైటార్పేయండీ."

"స్త్రీలనెప్పుడూ స్మృతులతో జీవించమని శాపించాడు విధాత."

"హుం! విధాత!" విరక్తిగా నవ్వింది కవిత.

"ఎందుకు నీకుగా నీవు జీవితాన్ని చీకటి మయం చేసుకుంటావు?" అడిగాడు సంజీవ్.

"నాకు మిగిలిందదే!"

"పొరపాటు...."

"కాదు, అది నా గ్రహపాటు. లేకుంటే ప్రభు ఇంత త్వరగా నన్ను విడిచి వెళ్ళిపోతాడా?"

"కవితా! మృత్యువుకి చిన్నా, పెద్దా అనిగాని, ఆడా-మగా అని గాని కనికరం లేదు. అయినా ఊపిరి ఉన్నంత వరకూ ఎవరి ప్రాణకు తగ్గట్టు వారు పాటుపడుతూ, బ్రతుకుని సార్థకం చేసుకోవాలి." అన్నాడు సంజీవ్.

కవిత ఏమీ అనలేదు. కొన్ని క్షణాలు మౌనంగా గడిచి పోయాయి.

"నాగరాజుని, గణపతిశాస్త్రిని కస్టడీలోకి తీసుకున్నారు" మౌనాన్ని భంగపరిచాడు సంజీవ్.

"ఏమో? వారంత పనికి పూనుకున్నారని నమ్మలేను."

"మరి?"

"పెళ్ళికి అంగీకరించాడు. కాని ఎవరో ఏదో అంటారని భయపడ్డాడు. అప్పుడు నీవు దండల పెళ్ళికి అంగీకరింపజేశావు. ఈ లోపు ఏదో గుర్తుకొచ్చి, మరేదో ఆలోచించి, దానిని భరించలేక ఆత్మహత్య చేసుకొని ఉండవచ్చుగా?" అంది కవిత.

సిగరెట్ వెలిగించాడు సంజీవ్.

"ఏమీ మాట్లాడారు కాదు." అడిగింది కవిత.

"మీ అమ్మగారేరి?" సంభాషణని మార్చాడు సంజీవ్.

"మీ ఇంటికే వెళ్ళింది."

"ఓ....మరి ఇక నే వెళ్తాను." అని, "రేపు కలుస్తాను" అంటూ కారు దగ్గరకు నడిచాడు.

మరో పావుగంటలో గమ్యం చేరుకున్నాడు.

కారు పార్కు చేసి లోపలి కెళ్తున్న వాడల్లా డాక్టరు ఎదురు కావటంతో ఆగి, "ఎలాగుంది?" అనడిగాడు సంజీవ్.

"మెంటల్లీ అప్‌సెటెడ్.... పరిసరాలు మారితే ఫలిత ముంటుందేమో!" అన్నాడు డాక్టర్.

"మీ నర్సింగ్ హోమ్‌లో చేర్చమంటారా?"

"అదే మంచిదనుకుంటున్నాను."

"ఓ. కె. డాక్టర్! ఐ విల్ మేక్ నెసెస్సరీ అరేంజ్‌మెంట్స్."

"ఓ. కె. గుడ్‌నైట్" అంటూ కదిలాడు డాక్టర్.

"గుడ్ నైట్" అంటూ బదులు పలికి పైకి నడిచాడు సంజీవ్.

అడుగుల సవ్వడి విని రావుగారి తల దగ్గర కూర్చునున్న కవిత తల్లి లేచి నిల్చుంది.

"నమస్తే .... మీ యింటినుంచే వస్తున్నాను." అని "కూర్చోండి" అంటూ ఆమెకు కుర్చీ చూపించి కూర్చున్నాడు.

"డాక్టర్ మత్తు ఇంజక్షన్ ఇచ్చారు." అంది ఆమె.

"ఆయన మానసికంగా ఆందోళన చెందుతున్నారు. అందుకే ఇవ్వక తప్పటం లేదు."

"ఇప్పుడు ఫ్యాక్టరీ గొడవలన్నీ ఎవరు చూస్తున్నారు?" సంభాషణ మార్చింది ఆమె.

"నేనే చూస్తున్నాను."

అంతలో గోడగడియారం ఎనిమిది గంటలు కొట్టింది.

"వెళతానుబాబూ.....ఇంట్లో కవితఒక్కతే ఉంది." లేచిందామె.

"కవిత మానసికంగా చాలా దిగజారి పోయిందండీ." అంటూ ఆమె ననుసరించాడు సంజీవ్.

"ఈ ప్రేమవివాహాలు కలిసిరావనిముందే చెప్పానుగా బాబూ"

"జీవితం వడ్డించిన విస్తరి కాదండి!"

"కావచ్చు. కాని విధి వ్రాతని తప్పించటం మన శక్యం కాదు."

"కష్టకాలంలో విధి వ్రాతని తిట్టుకుంటూ కూర్చునే కంటే పరిష్కారమార్గం వెదకటం విజ్ఞుల లక్షణం."

"ఏం చేయగలమో చెప్పు?" అడిగిందామె.

అప్పటికే కారిడార్‌లోకి ప్రవేశించారు.

"బాధల్ని మర్చిపోవడానికి ఏదైనా పని కల్పించుకొని చేయడం కన్నా ఉత్తమం మరొకటి లేదు."

"ఈ సమయంలో ఏ పని చేయగలదు....బాబూ!"

"ఎలాగూ ఫ్యాక్టరీ గొడవలు చూస్తున్నాను గదండీ! నాకు కొంచెం సహాయం చేస్తే చాలు."

"నా కభ్యంతరం లేదు." సమాధాన మిచ్చింది.

"థాంక్యూ." అని డ్రైవర్ని పిలిచాడు సంజీవ్.

"ఎందుకు బాబూ నడిచిపోగలను...."

ఆమె మాటలు విననట్లే డ్రైవర్‌కి పని పురమాయించాడు.

మరో రెండు నిమిషాల్లో కారు వచ్చి వారి ముందాగింది. వెనక తలుపు తెరచి పట్టుకుని "ఎక్కండి" అన్నట్లుగా చూశాడు సంజీవ్.

ఆమె కారులో కూర్చుంది.

తలుపువేసి "గుడ్‌నైట్" అన్నాడు.

ప్రతిగా ఆమె ఏదో అన్నది. కాని కారు కదలటంతో ఆ మాటలేవీ వినిపించలేదు. మెల్లగా లోపలికి నడిచాడు. హాలులో తల్లి ఫొటో ప్రక్కనున్న చిత్రాన్ని చూడగానే సంజీవ్ హృదయం కలుక్కుమన్నది. అది ప్రభుగీచిన జానకిచిత్రం. చేత వీణధరించి సరస్వతీదేవిలా ఉంది. అక్కడ నిలవలేని వాడిలా చరచరా పైకి నడిచాడు. ఎంట్రెన్స్ దగ్గరున్న సీతారాముల చిత్రం కంటపడింది. ప్రభు మదిలో మెదిలాడు. పరుగుతో కూడిన నడకతో గదివైపు అడుగు లేచాడు సంజీవ్.

# 14

కారు పార్కుచేసి లోపలి కొస్తున్న సంజీవ్‌ని చూసి, "నాన్నగారెలా ఉన్నారు బాబూ!" అనడిగింది కవిత తల్లి.

"ఇప్పుడే నర్సింగ్ హోమ్‌లో చేర్పించి వస్తున్నానండీ!" అంటూ మంచం మీద కూర్చున్నాడు.

"మీ నాన్నగారి దగ్గర ఎవరున్నారు?" అనడిగిన ఆమె ప్రశ్నకు బదులుగా, "మా ఇంటికి ఆడ దిక్కు లేదని తెలుసుగా?" అని ఎదురు ప్రశ్న వేశాడు సంజీవ్.

ఆమె నోటి నుంచి వేడి నిట్టూర్పొకటి వెలువడింది.

మంచు దెబ్బ తిన్న మల్లె మొగ్గలా దైన్యమైన చూపులతో శూన్యంలోకి చూస్తూ కూర్చునున్న కవిత మీద నిలిచింది సంజీవ్ దృష్టి. అతడి దృక్కు లెక్కడున్నాయో గమనించిన కవిత తల్లి, "కాఫీ తెస్తాను బాబూ!" అంటూ వంట ఇంట్లోకి నడిచింది.

"కవితా!"

దృష్టిని సంజీవ్ వైపు మరల్చింది కవిత.

"ఎంతకాలమని ఇలా ఊహా లోకంలోనే సంచరిస్తావు?"

"భౌతిక సుఖాలు, ఆనందాలు అనుభవంలోకన్న ఊహల్లోనే తియ్యగా ఉంటాయి."

"కష్టాలు మనిషి కోసం కాచుకుని ఉంటాయి. మనసు వున్న ప్రాణి కనకనే సుఖదుఃఖాలకు లోనవుతాడు మనిషి. కష్టపరంపరనే మహాసాగరంలో ఆవలితీరం కనిపించినప్పుడు ధైర్యం నశిస్తుంది. బ్రతికుండి ప్రయోజనం లేదనిపిస్తుంది. ఎంతటి సహజ పరిణామమైనా గుండె చిక్కబట్టుకొనక తప్పదు....మార్పు రాకమానేరదు" ధైర్యం పలికాడు సంజీవ్.

"...................."

"ఆలోచించు కవితా! అటు ప్రభు నా ప్రాణ స్నేహితుడు. ఇటు నీవు నా ఆత్మీయురాలివి. ఏ చొరవతో ఒకనాడు ప్రభులో మార్పు తెచ్చే బాధ్యత నీకప్పగించానో ఈనాడు అదే బాధ్యతని నేను నిర్వహించవలసి ఉంది. ఒక ప్రక్క ప్రభు పోయాడు. మరొక ప్రక్క ఉన్న తండ్రీ లేనివాడయ్యాడు. ఈ ప్రక్క నీవు ఇలా మారిపోయావు. ఇన్ని దెబ్బల్ని తట్టుకుంటూ ఫ్యాక్టరీ విషయాల్ని ఎలా నిర్వహించగలనో ఒక్కసారి ఆలోచించు. మీరంతా నన్నెందుకిలా ఒంటరివాణ్ని చేస్తున్నారో అర్థంగావటం లేదు" సంజీవ్ కంఠంలో దైన్యం తొణికిసలాడింది.

"..........."

అంతలో కాఫీ రావడంతో కాఫీ త్రాగేసి. "నే వెళ్తాను కవితా! బాగా ఆలోచించు. జీవితమంటే ఒక కంట కన్నీరు, మరోకంట పన్నీరు ఉంటాయి" అంటూ లేచి బయటకు నడిచాడు.

కారు శబ్దం అదృశ్యమైనా అతడు కదిలించి వెళ్ళిన విషయం మాత్రం ఆమెను వదల్లేదు. గతంలోకి జారిపోయింది.

అనాడు మాక్సీ వేసుకున్న కవితలో క్రొత్త అందాలు తొంగి చూస్తున్నాయి. కాలేజీ కాంపస్ దాటుతుండగా, సంజీవ్ కారుని ప్రక్కన ఆపి, "కమాన్ కవితా!" అంటూ ఫ్రంట్ డోర్ తెరిచాడు.

"థాంక్యూ" అంటూ ఎక్కి కూర్చుంది కవిత.

కారు కదిలింది.

"ప్రపంచంలో వన్నె, విలువ తగ్గని వస్తువులు బహుకొద్ది. అందులో స్త్రీత్వం ఉన్న స్త్రీ ఒకటి అంటారు" సిగరెట్ రింగులు వదుల్తూ అన్నాడు సంజీవ్.

"ఏమిటీమధ్య కవిత్వం కూడా ప్రారంభించావ్?" నవ్వింది కవిత.

"........నీవు నాతోనే క్లోజ్‌గా ఉంటున్నావని ఎన్ని ఘటాలు ఏడుస్తున్నాయో తెలుసా?"

"మరి, నీతో స్నేహం కలుపుకోవాలని ఎంతమంది అమ్మాయిలు తహతహ లాడ్తున్నారో తెలుసా?" ఎదురు ప్రశ్న వేసింది.

"స్నేహమనేది కలువలా వికసించేది. కాని అగ్నిలా జ్వలించేదికాదు" అన్నాడు సంజీవ్.

"మీ ఫ్రెండు ప్రభుని ఎన్నడూ నాకు పరిచయం చెయ్యలేదు" అంటూ టాపిక్ మార్చింది కవిత.

"చాలామంది మనుషులుగా పుట్టినా మట్టి బొమ్మల్లా మిగిలి పోతారు."

"అది వారి సెంటిమెంట్."

"కాదు కవితా! వాడొక దురదృష్టవంతుడు!"

"ఆ విషయం నాకూ తెలుసు."

"వాడిలో మార్పు తేవాలని ఎంతగానో శ్రమించాను. కాని ఫలితం శూన్యం."

"..........."

"కవితా!....ఇప్పటి వరకూ నేను ప్రయత్నించి విఫల మయ్యాను. నీవుకూడా ప్రయత్నించగలవా?" ఆశగా అడిగాడు.

"తప్పకుండా?"

"థాంక్యూ" అంటూ ఆమె చేతిని నొక్కి వదిలాడు.

కారు మరో అయిదు నిమిషాల్లో పెద్ద హోటల్ ముందాగింది.

"ఎక్కడికి?" అడిగింది కవిత.

"ఈవేళ నాకెంతో సంతోషంగా ఉంది. అందుకే...."అంటూ లోపలికి నడిచాడు.

కవిత అతన్ని అనుసరించింది.

తల్లి పిలుపుతో వర్తమానంలోకి వచ్చిన కవిత, "లేదు సంజీవ్! ఆ వేళ ప్రభు హృదయంలో మార్పు తీసుకురావాలనే అనుకున్నాను. కాని నా హృదయాన్నే కోల్పోతానని ఊహించలేదు." అనుకుంటూ కనుకొలకుల్లో నిలిచిన కన్నీటి చుక్కల్ని చీరె చెంగుతో అద్దుకుంటూ లోనికి నడిచింది.

# 15

రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చుని స్టెనోకి లెటర్సు డిక్టేట్ చేస్తున్న సంజీవ్ డోర్ శబ్దం వినిపించగా, "కమీన్!" అన్నాడు.

లోపలికి అడుగు పెట్టాడు గణపతిశాస్త్రి.

ఎర్రగా జీరలువారిన కళ్ళతో, తైల సంస్కారం లేక చిందర వందరగా పడున్న జుట్టుతో, ఎముకల గూటికి బట్ట కప్పినట్లున్న శరీరంతో కన్పడిన పిచ్చికవిని చూడగానే సంజీవ్ హృదయం ఆర్ద్రమైంది.

స్టెనోని పంపించేసి, 'కూర్చో!' అన్నట్లుగా కుర్చీ చూపించాడు.

మౌనంగా కూర్చున్నాడు శాస్త్రి.

బోయ్‌ని పిలిచి కాఫీ ఆర్డరిచ్చాడు.

మరో రెండు నిమిషాల్లో కాఫీ ముందుంచి వెళ్ళిపోయాడు బోయ్.

"తీసుకో" కాఫీ కప్పు అందుకుంటూ అన్నాడు సంజీవ్.

"సంజీవ్! ...." బావురుమన్నాడు శాస్త్రి.

గుండెలలో గూడుకట్టుకున్న బాధంతా కన్నీటి వెల్లువై ప్రవహించింది.

"బాధపడకు శాస్త్రీ! మీ నాన్నగారొచ్చి బెయిలిప్పించారుగా!" ఆరోజు పేపర్లోని విషయాన్ని గుర్తుచేసుకుంటూ అన్నాడు సంజీవ్.

"నేను హత్య చేశానంటే నీవూ నమ్ముతున్నావా?"

"నమ్మవలసింది నేనుకాదు న్యాయ పీఠం."

"మా బామ్మమీద ఒట్టు... నేను చంపలేదు. అసలు నేను కవినేగాదు"

"ఆ విషయం నాకు తెలుసు."

"ఏదో తమాషాకి బెదిరించానేగాని నేను హత్యచేయలేదు."

"నీకా ధైర్యం లేదని కూడా తెలుసు"

"అయితే నేను హత్య చెయ్యలేదని నీవు నమ్ము తున్నావుగా!" ఎంతో ఆశగా అడిగాడు పిచ్చికవి.

"చెప్పానుగా! నమ్మవలసింది నేనుగాదు. న్యాయపీఠమని"

అంతలో బోయ్ విజిటింగ్ కార్డు తెచ్చి ముందుంచాడు.

"ఓ.కె. శాస్త్రీ! తర్వాత కలుద్దాం" అంటూ పంపించేసి విజిట ర్సుని లోపలికి పంపించమని బోయ్‌కి చెప్పాడు సంజీవ్.

* * *

మరుసటి రోజు....

పుస్తకం చదువుతూ కూర్చునున్న కవిత అడుగుల శబ్దానికి తలెత్తింది. ద్వారానికడ్డంగా నిల్చునున్నాడు సంజీవ్.

"కూర్చో...." అంటూ మంచం చూపించి చేతిలోని పుస్త కాన్ని మడిచి ప్రక్కనే పెట్టింది.

"టైమ్ తొమ్మిది గంటలయింది" మంచంమీద కూర్చుంటూ అన్నాడు.

"......."

"నేను మీకొక విషయం చెప్పాను గుర్తుందా?" అడిగాడు.

"నాగురించి అనవసరపు శ్రమ తీసుకుంటున్నారు"

"అవసరం, అనవసరం అనేది ఆయావ్యక్తుల మధ్యనున్న అనుబంధాన్ని బట్టి ఉంటుంది"

"......"

"కవితా! ఒకరోజున ఏ అధికారంతో నీకొక బాధ్యత అప్పగించానో అదే బాధ్యత నన్నీనాడు వెంటాడుతోంది. అదీకాక దెబ్బ మీద దెబ్బ చొప్పున మూడు దెబ్బలు తిన్నాను. ఈ సమయంలో నాకు కొంత మోరల్ సపోర్టుకావాలి. అందుకే నిన్ను ప్రాధేయపడ్తున్నాను"

ఈ సంభాషణంతా వంటఇంట్లోనున్న కవిత తల్లిచెవిన పడక పోలేదు. అప్పటివరకు శ్రోతగా మిగిలిపోయిన ఆమె నడవలోకి రాక తప్పలేదు.

"మాట్లాడవేం కవితా?" తిరిగి అడిగాడు సంజీవ్.

"కవితా! తన పిల్లల ప్రేమ భాష్పాలకై తల్లిహృదయం ఎంతగా తల్లడిల్లుతుందో నీకర్థంగాదమ్మా! మీనాన్న పోయిన నాటి నుంచీ ఆశలన్నీ నీమీదే పెట్టుకుని అంతదాన్ని ఇంతదానిగా చేశాను. ఎందుకు? ఇలా కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ కాలం గడుపుతున్న నిన్ను చూడాలనేనా తల్లీ?" గాద్గిక స్వరంతో పలికింది కవిత తల్లి, ఆ మాటలకి ఏమనుకున్నదో ఏమోగాని మెల్లగాలేచి లోపలికెళ్ళింది కవిత. మరో పావుగంటలో ముస్తాబై వచ్చింది. "పద సంజీవ్!" అంటూ కారువైపు నడుస్తున్న కూతురువంక సజల నేత్రాలతో చూస్తుండిపోయిందా కన్నతల్లి.

## 16

కాలచక్రంలో మరో వారం రోజులు గడిచిపోయాయి.

కవిత రోజూ సంజీవ్‌తోపాటు ఫ్యాక్టరీకెళ్తుంది. ఇప్పుడామె అతనికి పర్సనల్ అసిస్టెంటు.

కవిత చెకప్‌చేసి ఇనిషియల్ వేసిన లెటర్సుమీద సంతకాలు

చేస్తున్న సంజీవ్ మ్రోగుతున్న ఫోను రిసీవర్ అందుకున్నాడు.

"యస్. సంజీవ్ స్పీకింగ్...."

"...."

"హల్లో డాక్టర్! నమస్తే! ఏమిటి విశేషాలు?"

"...."

"ష్యూర్లీ" అంటూ రిసీవర్ హుక్‌మీద పెట్టి లేచాడు. కవిత నుద్దేశించి ఇలా అన్నాడు. "ఎందుకో డాక్టరు అర్జంటుగా రమ్మని ఫోనుచేశారు.... నేను వెళ్తాను. కొన్ని లెటర్సుమీద సంతకాలు చేశాను. మరికొన్ని మిగిలున్నాయి. 'ఫర్' అని పెట్టి సంతకంచేసి అర్జంటు లెటర్సు పోస్ట్‌య్యేలా చూడు. అలాగే సెకండ్ పోస్టురాగానే ముఖ్యమైన లెటర్సుకి రిప్లెయి ఇవ్వు" చెప్పటం పూర్తిచేసి డోర్ వైపు నడిచాడు సంజీవ్.

మరో పావుగంటలో డాక్టర్ని చేరిన సంజీవ్, "డాక్టర్! నాన్న గారి కండిషనెలా ఉంది?" అంటూ ఆదుర్దాగా అడిగాడు. "నీ కోసమే ఎదురు చూస్తున్నాను సంజీవ్!" అంటూ పర్సనల్ రూమ్‌లోకి తీసి కెళ్ళి డాక్టర్ ఇలా చెప్పారు. "పరిసరాలు మారినందువల్ల మనిషిలో మార్పురావచ్చని ఆశించాము. కాని రోజు రోజుకీ ఆయన పరిస్థితి దిగ జారిపోతుంది. ఎంత కాలమని మార్ఫియా ఇంజక్షనిస్తాం? ఇవ్వకపోతే ఏవో పలవరింతలు. హి వాజ్ మెంటల్లీ షాక్డ్!"

"పోనీ మరో డాక్టరుకి చూపించ మంటారా?"

"మీ ఆత్మతృప్తికోసమైతే నాకెలాంటి అభ్యంతరంలేదు. కాని మీ శ్రేయోభిలాషిగా నేనిచ్చే సలహా ఒక్కటే. వెంటనే చట్ట రీత్యా జరగవలసిన ఫార్మాలిటీస్ ఉంటే అవి పూర్తి చేసుకోండి"

"డాక్టర్...."

"అవును సంజీవ్! ఆయన కాన్షస్‌లో ఉన్నప్పుడు ఎందుకో నిన్నే పిలుస్తారు.... బహుశ ఆయన ఉద్దేశ్యంకూడా నేను చెప్పిందే కావచ్చు"

"ఓ.కె. సీయూ!" అంటూ తండ్రివున్న గదివైపు నడిచాడు.

మాసిన గడ్డంతో, పీక్కుపోయిన దవడలతో జాగ్రదావస్థలో నున్న రావుగారిని చూసి "నిద్రపోతున్నారు" అనుకున్నాడు.

అతడలా అనుకుంటున్నంతలోనే "సంజీవ్!" అన్న కేక వినిపించటంతో చివాలున తండ్రి దగ్గరకు నడిచాడు.

"బాబూ సంజీవ్!" తిరిగి వినిపించింది.

"డాడీ!" తండ్రిని సమీపించాడు. కాని మూతలు పడున్న రెప్పలు తెరువబడలేదు. అయినా పెదవులు మాత్రం 'సంజీవ్' పేరునే ఉచ్చరిస్తున్నాయి.

కళాకాంతులులేని తండ్రి ముఖం చూడగానే అతడి హృదయం కలిచివేసినట్లయింది. కళ్ళవెంట నీరు పెల్లుబికింది. కన్నీటి చుక్కలు బుగ్గలమీదగా జారి రావుగారి ఫాలభాగంమీద పడ్డాయి. మెల్లగా భారంగా కనురెప్పలెత్తారు రావుగారు. తలదగ్గరే కూర్చుని తనవైపే చూస్తున్న కొడుకుని చూడగానే "వచ్చావా బాబూ!" అని ఉద్వేగంతో అన్నారు.

"డాడీ!" అంటూ తండ్రి ఎదపై తల ఆనించాడు.

"బాబూ! నాకు అంతిమ క్షణాలొచ్చేశాయి!"

"ప్లీజ్! మీరలా మాట్లాడకండి"

"నీకు తెలియదు సంజీవ్... నేను దుర్మార్గుణ్ణి.... ఒక వ్యక్తి జీవితాన్ని నాశనం చేసిన పాపాత్ముణ్ణి!"

"డాడీ! ప్లీజ్...." ప్రాధేయపడ్డాడు సంజీవ్.

"వద్దుబాబూ వద్దు....ఆ విషయం నా గుండెల్ని తొలిచేస్తుంది. ఆ విషయం నీకు చెప్పేంత వరకూ నాకు ప్రశాంతత లేదు... నిన్ను ఎన్నడూ కొడుకులా చూడలేదు. ప్రాణస్నేహితునిలా చూశాను. కాని ఈ ఒక్కవిషయం మాత్రం నీనుంచి దాచాను."అంటూ కాసేపు ఆగి "బాబూ! అవి నేను శాంతినికేతన్‌లో చదివే రోజులు. నాకు సంగీతమంటే మహాప్రీతి. ఆ వేళ వైశాఖ దీపోత్సవం. కుటీరాలన్నీ ప్రమిదలతో రంగ రంగ వైభవంగా అలంకరింపబడున్నాయి. అంద మైన ఆసన్నివేశాన్ని చూస్తూ వంటరిగా నడిచిపోతున్నాను. అంతలో ఒక కుటీరంముందు పద్మాకృతిలో అలంకరింపబడిన ప్రమిదల మధ్య కూర్చుని ఒకామె వీణ మీటుతుంది. ఆ మృదుమధుర గానాన్ని వింటూ అచేతనంగా అక్కడున్న చెట్టు మ్రానుదగ్గర నిల్చుండి పోయాను. పాట ముగించిన ఆమె నన్నుచూసి భీత హరిణిలా పరుగెత్తింది. కాని

నిత్యం ఆమె గానాన్ని వినటం నా దినచర్యలో ఒక భాగమయింది. ఆమె పేరు జానకి అని తెలుసు కున్నాను. జానకి 'నా జానకి' కావా లని ఆశించాను. నా ఆశ నెరవేరింది. ఆమె అంగీకరించింది. కాని మా నాన్నగారు వంశం-కులం-ప్రతిష్ట అని ఊగిసలాడే వ్యక్తి. ఆయనను ఎలా ఒప్పించటమా అన్నది సమస్య అయింది. అంతలో నా తొందరపాటు ఫలితంగా ఆమె గర్భవతి అయింది. ఏది ఏమైనా సరే తండ్రినే ఎదిరించటానికి సిద్ధమయ్యాను. కాని జానకి, 'ఇంటి క్రొత్తకోడలు గర్భవతిగా ఆ ఇంటి గడప ఎక్కటం ఆ ఇంటికి పరువుకాద'న్నది. కాన్పయిన తర్వాత ఆ బిడ్డని జానకి స్నేహితు రాలు అంటే ఇప్పటి కవిత తల్లి దగ్గర వదిలివెళ్ళి కాల క్రమంలో తిరిగి తీసికెళ్ళటానికి నిర్ణయించుకున్నాము. కాని ముక్కుపచ్చలారని పసిబిడ్డని నా చేతుల్లో ఉంచి, నా జానకి నా జీవితాన్ని చీకటి మయం చేసి పురిటిలోనే శాశ్వతంగా వెళ్ళిపోయింది." చెప్పటం ముగించి మౌనంగా కళ్ళు మూసుకున్నారు రావుగారు.

రెండు నిమిషాల తర్వాత తిరిగి చెప్పటం ప్రారంభించారు. "ఆ బిడ్డని మిషనరీ కాన్వెంటులో చేర్పించాను. శాంతినికేతన్‌లో చదువు ముగియటంతో నేను ఇంటికెళ్ళక తప్పలేదు. పరిస్థితులతో రాజీపడ్డాను. లోకం దృష్టిలో నేను అవివాహితుడ్ని. అందుకే మా నాన్నగారు నా జీవితాన్ని 'జ్యోతి'-అంటే మీ అమ్మ జీవితంతో ముడివేశారు. నా అభిప్రాయాలతో జ్యోతి ఏకీభవించేది. అనుకూల వతి అయిన ఆమె సాంగత్యంలో కాలం వెళ్ళబుచ్చసాగాను. నీవు పుట్టావు. ఒకరోజున—

"జ్యోతీ! బాబుకి ఏం పేరు పెడదాం?" అనడిగాను.

"అప్పుడే కాదు....మరొక బాబు పుట్టనివ్వండి. రామలక్ష్మణు లని ఒకేసారి పేరు పెడదాం" నవ్వుతూ అన్నది జ్యోతి.

"అదేమిటి? ప్రతి తల్లీ ఆడపిల్ల పుట్టాలని కోరుకుంటుందట. మరి, నీవు ఇద్దరూ మగపిల్లలు కావాలనే కోరుకుంటావేం?"

"ఏమోనండీ! ముద్దు గుమ్మల్లాంటి మగపిల్లలు పుట్టాలని, రామలక్ష్మణుల్లా అన్యోన్యంగా ఉండాలని నా కోరిక....రాముడు పుట్టాడు. ఇహ లక్ష్మణుడే తరువాయి" అని అటుంటే నా మనస్సులో

కాన్వెంటులోని బాబు మెదిలాడు. నేను మాట్లాడకపోవటం గమనించి, "ఏమిటలా ఉన్నారు?" అనడిగింది.

"జ్యోతీ! నీకొక విషయం చెబుతాను. బాధపడవుగా" అనడిగాను.

"మీ సహధర్మ చారిణినైన తర్వాత నాకా అవసరం రాలేదండీ" అంది.

"అయితే విను. నీకు రాముడు కాదు లక్ష్మణుడు" అన్నాను.

"అంటే...." జ్యోతి భృకుటి ముడివడింది.

"రాముడు కాన్వెంటులో పెరుగుతున్నాడు." అంటూ అసలు విషయం పూసగ్రుచ్చినట్లు చెప్పాను.

"ఓస్. ఇంతేనా!" అంటూ తేలిగ్గా నవ్వేసి, "నన్నెంత అల్పంగా ఊహించారండీ....మీ బరువు బాధ్యతల్లో నాకూ భాగం లేదనుకున్నారా? మీబాబు నాబాబు కాదనుకున్నారా?" అంటూ లేచి, "నా బాబు ఒక అనాధగా పెరగటానికి వీలులేదు....ఇప్పుడే వెళ్ళి తీసుకొస్తాను" అంటూ బయలుదేరింది.

"వద్దు జ్యోతీ! తర్వాత తీసుకొద్దాం" అన్నాను.

'కాదు సపేమిరా' అంటూ తానొక్కతే కారు తీసుకొని బయలుదేరింది బాబూ!" అంటూ ఆగిపోయారు రఘునాథరావుగారు.

"ఆ తర్వాత....?" ఆతృతగా అడిగాడు సంజీవ్.

"నా జీవితాన్ని నీలినీడలు క్రమ్మేశాయి....ఒంటరి వాడనయ్యాను."

"..........."

"నా జ్యోతి కారు కాన్వెంటుని చేరక మునుపే యాక్సిడెంటయింది. ఫలితంగా జ్యోతి నాకు లేకుండా పోయింది."

"భూమిమీద పడ్తూనే అటు కన్నతల్లిని పోగొట్టుకున్నాడు.ఇటు సవతి తల్లిని పోగొట్టుకున్న దురదృష్టవంతుడయ్యాడు. అందుకే వాణ్ణి అనాధగా కాన్వెంటులోనే ఉంచాను. నా కళ్ళముందే నాబాబు తిరుగుతున్నా నోరారా 'బాబూ!' అని పిలవలేక పోయాను. 'నేను అనాధని' అని కుమిలిపోతుంటే 'నీవు అనాధవి గాదు, నేనే నీ తండ్రిని బాబూ!' అని చెప్పుకోలేని దురదృష్టవంతుణ్నయ్యాను...."

"అతను........"

"అతను ఎవరోగాదు బాబూ! ప్రభు."

అదిరిపడి చూశాడు. సంజీవ్.

"వాడి పుట్టినరోజున అందరి ముందూ 'వీడు నా బాబు' అని చెప్పాలనుకున్నాను. కాని ఈ లోపునే వాడు పెళ్ళికి ముహూర్తం పెట్టుకున్నాడు. అందుకే నిన్ను అతిథుల మిషతో ఎయర్ పోర్టుకి పంపించి స్వయంగా నేనే వెళ్ళి 'బాబూ! నేనే నీ తండ్రిని........ నీపెళ్ళి కవితతోనే వైభవోపేతంగా జరిపిస్తాను. ఈ రోజు కార్యక్రమాన్ని రద్దు చేసుకో!' అనిచెప్పాను.

'సరే' అన్నాడు.

"కాని.... ఇంతలో ఈ ఘోరం జరిగిపోయింది బాబూ!" అని చెప్తున్న రావుగారు అడుగుల సవ్వడికి తల ప్రక్కకు త్రిప్పారు. వెళ్ళిపోతున్న సంజీవ్ కనుపించాడు. కారు స్టీరింగ్‌ముందు కూర్చున్నాడన్న మాటేగాని సంజీవ్ మస్తిష్కంలో ఎన్నో ఆలోచనలు మెదిలాయి. కారు కదిలింది. కాని ఆలోచనలకు మాత్రం బ్రేకులు పడలేదు.

"ప్రభు తన సొంత అన్నా?" సంజీవ్ హృదయం గిలగిల్లాడింది.

మరో పావుగంటలో కారు పోర్టికోలో ఆగింది.

కారుదిగి లోపలికి పోతున్న సంజీవ్ దృష్టి తల్లిఫొటో ప్రక్కనున్న వీణను చేతిలోపట్టుకునివున్న చిత్రంమీద పడింది. తన తల్లి చిత్రమని తెలియక ప్రభుగీసిన చిత్రమది.

"ఈమె అంటే కవిత అమ్మకు ప్రాణం... కాలగర్భంలో కలిసిపోయిన ఈమెను కళ్ళెదుట నిలిపే శక్తి నీచేతికుందని చూపించటానికే ఈమె ఫొటో తీసుకొచ్చాను"

"నీమాట నిరూపిస్తాను" అని ప్రభు ఫొటోను చిత్రంగా గీచి ఇచ్చాడు.

ఒకనాడు తనకి ప్రభుకి మధ్య జరిగిన సంభాషణ గుర్తురాగా అక్కడ నిలువలేక నాయర్‌ను పిలిచి వందరూపాయలిచ్చి బ్రాందీ బాటిల్ పట్టుకురమ్మని, వడివడిగా అడుగులేస్తూ పైకి నడిచాడు.

ప్రభుగురించిన ఆలోచనలు గజిబిజిగా మనసంతా అలుముకో

సాగాయి. ఆ ఆలోచనల్లనుంచి పారిపోవాలని ప్రక్కనేఉన్న టేప్ రికార్డర్ ఆన్ చేశాడు. ఏదో పాట వినవచ్చింది.

ఆ పాటవింటూ, సిగరెట్ పొగ రింగులు వదుల్తూ కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

"అవును డాడీ! అన్నకోసం సకల రాజభోగాల్ని, నవయవ్వనవతి అయినా భార్యనికూడా వదులుకొని అరణ్యాలకొచ్చాడు లక్ష్మణుడు. రెప్పవాల్చకుండా, పిసరంతైనా విశ్రాంతిలేకుండా అన్నకి సేవచేశాడు. కాని తననే నమ్ముకుని తనవెంట అరణ్యాలకొచ్చిన సీతని శంకించి అగ్నిప్రవేశం చేయించాడు రాముడు. తిరిగి లోకభీతికి సీతనే పరిత్యజించాడు" ఆ మాటలు వింటూనే ఉలిక్కిపడి లేచాడు. 'ఒకనాటి తన సంభాషణ ఈ టేప్‌లోకి ఎలా వచ్చింది?' అనుకుంటూ అయోమయంగా చూశాడు.

"నేను ఇష్టపడటమంటూ జరిగితే అది లక్ష్మణున్నే. నిజంగా నాకూ ఒక అన్నఉండే ఆ లక్ష్మణుడి లాగానే నా అన్నని సేవించి తరించేవాడ్ని..." టేప్‌రికార్డర్ పలుకులతో ఈ లోకంలోకొచ్చి ఆ సంభాషణని వినలేని ఉన్మాదిలా రెండుచేతులతోనూ రికార్డర్ని లేవనెత్తి బలంకొద్దీ నేలకేసి కొట్టాడు.

నాయర్ తెచ్చిచ్చిన బాటిల్ అందుకొని ఓపెన్ చేసి గ్లాసులోకి వంచుకున్నాడు.

"సంజీవ్...." అన్న సుపరిచితమైన కంఠంవిని చేతిలోకి తీసుకుంటున్న గ్లాసుని టీపాయ్ మీదే వుంచి వెనుతిరిగాడు. కాని ఎవరూ కనిపించలేదు.

తిరిగి గ్లాసు నందుకోబోయాడు.

"సంజీవ్! సెంటిమెంటల్ అనేది నరాల జబ్బురా.... నేను నీ ఫ్రెండుని.... కాదు కాదు నీ అన్నని. నేచెప్తున్నాను త్రాగకురా!" తిరిగి మాటలు వినిపించటంతో అవాక్కయిపోయి నిల్చున్నాడు.

"సంజీవ్! భగవంతుడే ప్రత్యక్షమై వరం కోరుకోమంటే జన్మ జన్మలకీ నీ స్నేహాన్నే ప్రసాదించమని కోరుకోవాలనుకున్నాను.... ఎందుకు? ఇందుకేనా?"

"ప్రభూ!" అంటూ రెండుచేతులతో తలపట్టుకున్నాడు.

వికటాట్టహాసం వినిపించగా కళ్ళు తెరిచాడు. సంజీవ్ కళ్ళకి ప్రభు కన్పించాడు.

"ప్రభూ!" అంటూ దగ్గర కెళ్లాడు. అతని ఛాయ అంతర్ధానమయింది.

తిరిగి "సంజీవ్" అన్న పిలుపు వినరాగా వెనుదిరిగాడు

ఒకటికాదు. పది రూపాలుగా నిలిచాడు ప్రభు.

"సంజీవ్! నా వారులేరే అని తపించిపోతున్న నేను నీవే నాతమ్ముడి వనుకున్నానుకాని....

"ప్రభూ!"అంటూ ఒక్క ఉదటున టేబుల్ దగ్గరకెళ్ళి పేపర్ వెయిట్‌గా ఉపయోగిస్తున్న బ్రాస్‌నైఫ్‌ని తీసుకొని గుండెలలోకి దించుకో బోయాడు. కాని అంతలో ఒకరి చెయ్యి అడ్డు తగలటంతో ఆగిపోయాడు.

"కవితా!" విభ్రాంతిగా అరిచాడు సంజీవ్.

"నిరాశాజనకమైన మా జీవితాలపై మాకు ఆశలు కల్పించావు. కాని నీవు చేస్తున్నదేమిటి? నేను రావటం ఒక్క నిముషం లేటయితే ఏమయి ఉండేదో ఊహించు. అసలు ఎందుకింత ఘోరానికి తలపడ్డావో.... చెప్పు!" అన్నది కవిత.

"చెప్తాను కవితా! చెప్తాను. నేను మీకుచేసిన ద్రోహంచెప్తాను"

"నాకు నీవు ద్రోహం చేశావా?" ప్రశ్నార్థకంగా ముఖం పెట్టింది కవిత.

ముఖాన పట్టిన చెమట తుడుచు కుంటూ, "అవును కవితా! నీ అంద చందాల్ని చూసి నిన్ను ప్రేమించాను. నేను లక్షాధికారిని. అందువల్ల నిన్ను వివాహం చేసుకోవటం పెద్ద సమస్య కాదనుకున్నాను. సమయం వచ్చినప్పుడే చెపుదామను కున్నాను. ప్రభు నా ప్రాణ మిత్రుడు. చైతన్య రహితమైన వాడి జీవితంలో చైతన్యాన్ని సృష్టించాలనుకున్నాను. అందుకే హాఫ్ ఫాంటు వేసుకొని బ్యాట్ పుచ్చుకుని వెళుతున్న నిన్ను చూపించి నీచిత్రం గియ్యమన్నాను. నామాట కాదన లేకపోయాడు. అదే ఇది." అంటూ డన్‌లప్ పిల్లో క్రిందనున్న చిత్రాన్నితీసి కవిత చేతికిచ్చాడు.

తిరిగి చెప్పటం ప్రారంభించాడు సంజీవ్."నేను నిన్ను నా

బెటర్‌హాఫ్‌గా భావిస్తూ వచ్చాను. అందుకే ఒకరోజున నిన్ను హోటల్‌కి తీసికెళ్ళి ప్రభుని సంస్కరించే కార్యక్రమంలో నాతో పాటు పాలుపంచుకోమన్నాను. నీవు 'సరే' అన్నావు. 'నన్నర్థం చేసుకునే నాన్నగారున్నారు, ఆస్తివుంది, అనుకూలవతి అయిన భార్య రాబోతుంది. నా అంత అదృష్టవంతుడులేడు.' అని అనుకున్నాను. ఊహించినట్లుగానే ప్రభులో మార్పు తేగలిగాము. నాసంతోషానికి అవధులులేవు. కాని ఒకరోజు ప్రభు.

"సంజీవ్! కవితతో నా వివాహం జరిగేలాచూడు. ఆమె సాంగత్యంలో నాకు ప్రశాంతత దొరుకుతుందనే ఆశిస్తున్నాను. ప్లీజ్! నన్నర్థంచేసుకో........ ఈ ఒక్క విషయంలో నన్నభ్యంతరం పెట్టకు" అని ప్రాధేయపడ్డాడు. నాలో సంఘర్షణ ప్రారంభమయింది. అప్పటివరకూ ప్రభు సుఖపడితేచాలు అనుకున్నాను. నా ప్రయత్నాలు ఫలించాయి. కాని ఏ వ్యక్తిని గురించి నేను కలలు గంటున్నానో ఆ వ్యక్తినే కాంక్షిస్తున్నాడు. అసలు విషయంచెప్తే? మానుతున్న గాయం రేగుతుందా? అప్పుడు నా ఈ ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరేనా? అప్పటివరకూ నేను నీ దగ్గర నా ప్రేమని వ్యక్తం చెయ్యలేదు. అందుకే ప్రభుకోసం నిన్ను మర్చిపోవాలనుకున్నాను. అందువల్లనే మీ అమ్మగార్నొప్పించాను.

"కాని ఒకరోజున మీరిద్దరూ వర్షంలో మా ఇంటి కొచ్చినపుడు జరిగిన సంఘటనలు నాలోని నిగ్రహాన్ని పటాపంచలు చేశాయి.

"ఒకనాడు నీగురించి నాకెలాంటి ఆలోచనలుండేవో తిరిగి అవే ఆలోచనలు నా మనస్సులో మొలకెత్తసాగాయి. ఎందువల్లనో, నీ ముఖంలోకి సూటిగా చూడలేకపోయేవాడ్ని. బహుశ పెళ్ళి అయితే నాకీ ఆలోచనలు రావేమోనని ముహూర్తం పెట్టించాను. ప్రభు అభ్యంతరం చెపితే దండిల పెళ్ళికి ఏర్పాట్లు చేశాను.

"ఉదయం డ్రస్సింగ్ పూర్తి చేసుకొని బయలుదేరుతున్న నన్ను డాడీ పిలిచి ఏరోడ్రోమ్‌కి వెళ్ళి రమ్మన్నారు. గెస్టుని, గెస్ట్ హౌస్‌కి చేర్చేసరికి తొమ్మిదిన్నర అయింది. ఆ టైముకల్లా స్టూడెట్సంతా హోటల్‌కొస్తారని ప్రభుమాత్రం నాకోసం ఎదురు చూస్తుంటాడని నాకుతెలుసు. అందుకే తిన్నగా హాస్టల్‌కెళ్ళాను. తిరిగి

ఏ ఆలోచనలైతే నాలో మొదట ఉన్నాయో అవే ఆలోచనలు నాలో మేల్కొన్నాయి. ఒక్కొక్క మెట్టు పైకెక్కుతుంటే నాలోని మానవత్వంస్థానే పైశాచికత్వం స్థానమేర్పరచుకోసాగింది. నేను వెళ్ళేసరికి ప్రభు 'టై' కట్టుకోబోతున్నాడు.

"సంజీవ్! నీకొక శుభవార్త చెప్తారా!" అన్నాడు ప్రభు. వాడు శుభవార్త అంటే ఏదో మామూలు విషయం అనుకున్నాను. కాని ఈవేళ డాడీ చెప్పినట్లు. డాడీ హస్టల్ కెళ్ళటంగాని, ప్రభూ, నేనూ సొంత అన్నదమ్ములమన్న సంగతిగాని వాడు చెప్పబోతున్నాడని గ్రహించలేకపోయాను. అందుకే 'నాకు తెలుసురా!' అని, "ఏది నిన్ను నేను పెళ్ళి కొడుకుని చేస్తానురా" అంటూ వాడి చేతిలోని 'టై' తీసుకున్నాను. 'టై' ప్రభు మెడకు బిగించాను. అంతే! పర్యవసానం...." అంటూ బాధగా కళ్ళుమూసుకున్నాడు సంజీవ్. అడుగుల చప్పుడు వినిపిస్తే కళ్ళువిప్పాడు. కాని అప్పటికే రావుగారి గదిలోకి ప్రవేశించి తలుపేసుకున్నది కవిత.

"కవితా....! కవితా....!" అంటూ తలుపు తట్టాడు.

సమాధానం రాలేదు.

ఆ శబ్దానికి నాయర్వచ్చాడు. నాయర్ సహాయంతో తలుపు తెరిచాడు సంజీవ్. కాని అప్పటికే ఆమె పని పూర్తిచేసింది. ఆమె చేతిలోని ఖాళీ నిద్రమాత్రల సీసా సంజీవ్నిచూసి ఫక్కున నవ్వింది.

"డాడీ! మీరు వాడే నిద్రమాత్రలు ఈ విధంగా తనువుని చాలించటానికుపయోగ పడ్తాయన్న ఆలోచన నాకు రాలేదు" అనుకుంటూ రెండు చేతులలో కవితనెత్తుకొని కారువైపు నడిచాడు సంజీవ్. మరో పదినిమిషాల్లో కారు నర్సింగ్హామ్ ముందాగింది. కవితని ఎమర్జెన్సీ రూమ్లోకి తీసుకెళ్ళారు.

తిరిగి వచ్చి కారు స్టీరింగ్ ముందు కూర్చున్నాడు సంజీవ్. స్పీడో మీటర్లోని ముళ్ళు ముందుకు కదుల్తుంది. సరిగ్గా అదే సమయంలో రైలొకటి గేట్లులేని రోడ్డుని క్రాస్చేస్తుంది. కాని సంజీవ్ మాత్రం కారు బ్రేకులమీద కాళ్ళేసే ప్రయత్నం చెయ్యలేదు....?

96

—సమాప్తం—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M131 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CF |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Soumya |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |